# భారతి

సాహిత్య మాసపత్రిక




ఫిబ్రవరి : 1990 వెల : 5 రూపాయలు




వ్యవస్థాపకులు

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు



# అమృతాంజన్ గ్రైప్ వాటర్




పాప ఆరోగ్యానికి,
సంతోషానికి దివ్యామృతం

అజీర్ణం, వాయువు, కలతనిద్ర, వాంతులు,
విరేచనాలవంటి బాధలు వెంటనే తగ్గిపోతాయి.
ఆకలి, జీర్ణశక్తి బాగా వుంటాయి పాపాయి
ఆరోగ్యం బాగుపడుతుంది.

అమృతాంజన్ లిమిటెడ్
42-45, లజ్ చర్చ్ రోడ్డు,
మద్రాసు 600 004

**Amrutanjan Limited**



753-T(

# భారతి

మాసపత్రిక

*

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)

*

**సంపుటము : 67** **ఫిబ్రవరి 1990** **సంచిక : 2**

విడిపత్రిక వెల ఐదురూపాయలు

## విషయానుక్రమణిక



# స్వ విషయం

ఆదికవి నన్నయ గురించి రకరకాల పరిశోధనలు ఇప్పటికీ జరుగుతునే ఉన్నాయి. ఈ నెల భారతిలో ప్రకటించిన కీ. శే. కే. ఎస్. కోదండరామయ్య వ్యాసం నన్నయను గురించిన ఎన్నో విషయాలను అందిస్తుంది. నన్నియ, నన్నయ, నంజుండ, నన్న, నన్ని - వంటి శబ్దాలమీద కూడా ఈ వ్యాసంలో సవిస్తరంగా వ్యాఖ్యానించడం జరిగింది. "నన్నయభట్టు" అనేది తెలుగు పేరేనని కోదండరామయ్యగారి అభిప్రాయం. మరి పరిశోధకులు ఏమని సెలవిస్తారో....

నన్నయ గురించి చదవడమంటేనే ఆంధ్ర సాహిత్య చరిత్రకు శ్రీకారం చుట్టినట్లు అవుతుంది. ఈ మాసం భారతిలో ఆంధ్ర సాహిత్య చరిత్రను గురించి ఒక వ్యాసాన్ని అందిస్తున్నాము. ఆసక్తికరంగా ఉండగలదని మా నమ్మకం.

ఆధునిక కవిత్వం రాసేవారిలో సిద్ధహస్తుడనిపించుకుంటున్న శ్రీ మాదిరాజు రంగారావు వచన కావ్యాల మీద ఈ నెల సంచికలో ఒక సమీక్షా వ్యాసం ప్రచురించబడింది. తెలుగు కవిత్వపు తీరుతెన్నులు ఏ విధంగా ప్రయాణిస్తున్నదీ ఈ వ్యాసం ద్వారా కొంతవరకైనా అంచనా వేయవచ్చు.

ప్రఖ్యాత కథకుడు శ్రీ ఏల్చూరి విజయ రాఘవరావు అందించిన "చిత్రవధ" కథ సాహితీ సుగతులను అలరించగలదని ఆశిస్తున్నాము. ఇతివృత్తంలో కొత్తదనం లేకపోయినా - కథనంలో అసాధారణమైన నైపుణ్యం చూపి - కంట తడి పెట్టించే యదార్థ గాథా అనిపించే - "చిత్రవధ" - అవశ్యము పఠనీయము.

శ్రీ సి. పి. బ్రౌన్ పేరు వినని తెలుగువారు ఎక్కువగా ఉండరు. ఆయన సేకరణల మీద డా॥ వెలగా వెంకటప్పయ్య ఈ నెల భారతిలో రాసిన వ్యాసం పరిశోధకులకు కొంతవరకైనా ఉపకరించగలదు.

ఈ నెల భారతిలో అందిస్తున్న కవిత్వంలో ఎంతో వైవిధ్యం ఉంది. నవ్వుకునే అంతరాత్మలు, మాట్లాడే చిత్రాలు, ప్రవహించే జీవితాలు, అనుభూతిని అందుకునేందుకు ఆరాటపడే అక్షరాలు - ఎన్నో కనిపిస్తాయి.

చదివి చూస్తే కాని భారతి అందిస్తున్న రససాగరపు లోతు తెలిసిరాదు.

# మేఘరంజని

## శ్రీ వేముగంటి నరసింహాచార్యులు

క॥ తొలకరి జల్లులు కురిసిన
చెలకలలో నేలతల్లి జిగి నెమ్మేనన్
పులకలుగా నవసస్యపు
మొలకలు తులకించె పచ్చ మొగవిచ్చువగన్

గీ॥ ఇన కరాగ్రతాప ఘనమున నీనయమ్ము
వేగిపోయి ఎపుడొ మూగవడిన
కన్నె వాగు గొంతు కిన్నెరయై మ్రోగె
రమ్యజీవన నవరాగ మెసగ

సీ॥ ఒక నీలిమబ్బు తునక పైన హరివిల్లు
చిత్రవర్ణములు రచించిపోయె
ఒక నీల జీమూత మకళంక రవిబింబ
మున లలిచిక్కని ముసుగు వేసె
ఒక కరిమొయిలు వాలికమెయి ప్రకృతికి
కొమరారు నీలాల గొడుగు పట్టె
ఒక నల్లని ఘనంబు ఉఱుముల మెఱుముల
గర్జించి భర్జించి కలత పెట్టె

ఉ॥ తూనిగ లాడె ఆకసపు
త్రోవలలో కరిమబ్బు దొంతరల్
ఏనుగుగున్నలట్లు చరియించెను
సాంద్ర నితాంత తోయధా
రా నివహమ్ము ధారుణి భరమ్ముగ
జాల్కొనియెన్ కృషీవల
శ్రేణి గహమ్ములందు సిరి
చిన్నెలు వన్నెలు నూలుకొల్పెడున్

గీ॥ ఒక మహాభీల కాలపయోధరమ్ము
విరివిగా జలధారలు కురిసి కురిసి
పూర్ణవాహినీ పరివహత్ స్ఫూర్తి గూర్చి
జగతి కంతకు ఆర్ద్రత సంతరించె

గీ॥ నీటికిని, కూటికిని, గ్రీష్మధాటికిని వి
తాకు పడి తల్లడిల్లెడు లోకమునకు
తర తరాలుగ జీవనాధార మొసగు
'ఘనుడు' నిక్కముగా త్యాగధనుడు కాడె?

గీ॥ ఊళ్ళ కూళ్ళు ముంచి, ఏళ్ళను పొంగించి,
జనుల ఆశ త్రెంచి, వనట పెంచి
గగనమెల్ల గ్రమ్మి ఘనఘనా ఘనములు
కుండిపోత వాన కురిసిపోవు



సేకరణ, సమర్పణ :

కీ. శే. కే.యస్. కోదండరామయ్య

శ్రీ కారుపల్లి విశ్వనాథం

# నన్నయగారిని గురించిన మరికొన్ని విషయములు

చిరకాల పరిశోధనా ఫలితముగ నేను వ్రాసిన "నన్నయ భట్టు యే ప్రాంతము వాడు?" అను పొత్తమునకు సమంజసమైన సాహిత్యపు విలువ గలదని గుర్తించి, ఉదారమతితో, భాషాభిమానముతో హైదరాబాదు నగరమందుండు "అంతర్జాతీయ తెలుగుసంస్థ" వారా పొత్తమును అందముగ ముద్రించి యిచ్చిరి. ఇంతేకాక, ఆ గ్రంథస్థ విషయమును తమ "తెలుగువాణి" మాసపత్రిక (1983, జనవరి)లో ప్రచురించి, నాకు చక్కని ప్రోత్సాహమును, ధైర్యమును గలిగించారు. ఆ సంస్థ వారికి నా కృతజ్ఞతలు.

ఆవల 12-2-1983వ నాడు హోసూరులో అంతర్జాతీయ తెలుగుసంస్థ అధ్యక్షులు శ్రీ వందేమాతరం రామచంద్రరావుగారి అధ్యక్షత క్రింద జరిగిన, నన్నయ నవశత జయంతి ఉత్సవ మహా సమావేశములో, కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు, శ్రీ తుమ్మపూడి కోటీశ్వరరావుగార్ల వంటి మహాకవుల సమక్షములో మహాకవి, కళాప్రపూర్ణ, డాక్టర్ దాశరథిగారా పొత్తమును ఆవిష్కరించి, ప్రశంసించారు.

పిదప పెక్కుమంది సుప్రసిద్ధాంధ్ర పండితులు, కవులు ఆ పొత్తమును ప్రశంసించారు. ఇట్టి పొత్తము ఆకారమున చిన్నదైనను, ప్రశంసలకు, అంగీకారములకు బాత్రమై నాకెంతో ధైర్యమును, ఉత్సాహమును సమకూర్చింది. చిరకాలముగా వాదోపవాదములకు గురియై, నానుడుగా నుంటూ వచ్చిన నన్నయ గారి నామధేయము, మరియు నాతని జన్మస్థలమును గురించిన వివాదమునకు బహుపండితాంగీకారమైన, ఆధార పూర్వకమైన, పరిష్కారం లభించినదని చెప్పవచ్చును.

కొందరు, పెద్దలు నాకు వ్రాస్తూ, నన్నయ సహాధ్యాయుడైన నారాయణభట్టును గురించియు, నన్నయ రాజరాజునకు కుల బ్రాహ్మణుడుగా నుండెనను విషయమును గురించియు నా యభిప్రాయమును విశదపరచ వలయునని సూచించినందున ఎందరో పండితులే యింతవరకు పరిష్కరించక వాదముగానే యుండునట్టి యీ విషయమును గురించి వ్రాయగల సమర్థత నాకు లేకున్నను, నన్నయగారిపట్ల నాకు గల భక్తి, ఆంధ్ర సాహిత్యము పట్ల గల ఆసక్తి, మరియు నా పరిశోధనల ద్వారా తెలియవచ్చు విషయములను ఆంధ్ర విద్వల్లోకమునకు నివేదించ వలయునను కుతూహలంతో మనవి చేయుచున్నాను. పై రెండు విషయములను గురించి చెప్పుటకు ముందు నన్నయగారిని గురించి మరికొన్ని విషయములను చెప్పవలసి యున్నది.

సృష్టి, స్థితి, లయ కారణభూతుడైన పరమేశ్వరుడొక్కడే యయ్యును, భక్త సులభుడు, భక్త వత్సలుడు, భక్త పరాధీను డగుటవలన ఆయా భక్తుల ననుగ్రహించుటకై, ఒక్కొక్క ప్రాంతమున నొక్కొక్క నామరూపములతో, కరుణామతితో దన దివ్య సాన్నిధ్యము ననుగ్రహించియున్నాడు. ఈ విధమును బట్టి, కర్ణాటకములో, ప్రాచీన శ్రీరంగ పట్టణము సీమలో* నాతడు శివుడై, నంజుండేశ్వరుడను నామధేయముతో వెలసెను. పరమేశ్వరుని నివాస స్థలమైనందువలన నా స్థలమునకు నంజనగుడ అను నామధేయ మేర్పడినది. ఈ స్వామినే 'శ్రీకంఠేశ్వరు' డనియు, 'గరళ పురీశ్వరు' డనియు తరతరాల నుండి యీ ప్రాంతమందలి భక్తులు పిలుచుచున్నారు.

---

* శ్రీరంగ పట్టణము మైసూరు నగరమునకు 10 మైళ్ళ దూరమందున్నది. నన్నయనాటికి మైసూరు రాజ్య మేర్పడియుండ లేదు. అది 17వ శతాబ్దమున నేర్పడినది. నంజనగుడి మైసూరుకు 12 మైళ్ళు దక్షిణమందున్నది. శ్రీరంగ పట్టణమునకు మరియు నంజనగుడికి మధ్య గల దూరము 22 మైళ్ళు.

ఈ పుణ్యక్షేత్ర మే కాలమున నేర్పడినదను విషయము దెలియకున్నను, క్రీ.శ. 4వ శతాబ్దమునుండి గంగవాడి రాజ్యమును పాలించిన పశ్చిమగంగ రాజుల కాలమునాడే ప్రసిద్ధికి వచ్చినదని ఆధారపూర్వకముగా దెలియుచున్నది. గంగరాజులలో బెక్కుమందికీ స్వామి నామధేయమున్నది. వీరికే కాక, ప్రాచీన కర్ణాటక రాజ్యము నేలిన చాళుక్య, రాష్ట్రకూట, హొయసల, నోలంబ వంశములకు జెందిన రాజులలో గొందరికి యీ స్వామి పేరు గలదని ఆయా రాజుల శాసనముల నుండి తెలియుచున్నది.

మైసూరు దేశమును క్రీ॥శ॥ 600 ప్రాంతము నుండి పాలించిన 'అరసు' లను రాజులకీ దేవుడు పరమ దైవము వారి ఇలవేల్పు. ఆ రాజు లీ దేవాలయమున పెక్కు కైంకర్యములు గావించి, స్వామివారి కైంకర్యములు నిర్విఘ్నముగ గొనసాగుటకై పెక్కు గ్రామములను కూడ నొసగిరని తెలియుచున్నది.

క్రీ.శ. 1819వ సంవత్సరమున మైసూరు రాజ్యమును పాలించుచుండిన కృష్ణరాజ ఒడయరు పూర్వము గౌతములు నిర్మింపజేసియుండిన నంజుండేశ్వర స్వామి రథము శిథిలమై యుండగా మరామత్తు చేయించెనని తెలియుచున్నది. "ఇట్ స్టేట్స్ దెట్ కృష్ణరాయా ఒడయ గాట్ రిపేర్డ్ ది ప్రొసెషనల్ కార్ సెడ్ టు హావ్ బీన్ గాట్ డన్ బై గౌతమ ఫార్ ది గాడ్ శ్రీకంఠేశ్వర, డిస్క్రైబ్డ్ యాజ్ గరళ పురాధీశ్వర, ది రికార్డ్ ఈజ్ డేటెడ్ శక. 1741. (=1819) "శాసనస్థ విషయ మిట్లున్నది. "శ్రీ కృష్ణరాజ వడయరవరు శ్రీ గరళ పురాధీశ శ్రీకంఠేశ్వర స్వామి యవరిగె గఉతమరు మాడిశిద రథవు శిథిల వాదద్దు యీ దివస జీర్ణోధారా మాడిసి దంథా సేవెశ్రీ".

[వైడ్. ఎపి. కార్. వాల్యూం-3. నెం-107. పుట-187]

ఈ నంజుండేశ్వర స్వామి కొన్ని శాసనములలో 'నంజయ దేవరు' అని కూడ చెప్పబడియున్నాడు. చూడుడు. "స్వస్తి శ్రీ శకవరుష ౧[౭౩]౧ సంద ప్రమాధి సంవత్సరద చయిత్ర సుగల్లు స్వస్తి సమస్త భువనాధిపతియప్ప శ్రీ. కైలాసనివాస శ్రీకపిలా కౌండిల్య సంగమద నంజుండేశ్వర దేవరిగె...సర్వ స్వామ్యవను నంజయ దేవరిగెన య్యేధ్యనం దా దీవిగె ఇష్టను...."

[వైడ్, ఇబిడ్. నెం-115. పు-256]

మైసూరు రాజులే కాక, విజయనగర సామ్రాజ్యమును పాలించిన మొదటి హరిహరరాయల నుండి, ఆరవీటి చక్రవర్తులైన వెంకటపతి రాయల వరకు, ఈ స్వామిని సేవించి కైంకర్యములు గావించియున్నట్లు, శాసనాధారము లున్నవి. ఇంతయేల, ఆంధ్రభోజుడు సాహితీ సమరాంగణ సార్వభౌముడైన శ్రీకృష్ణదేవరాయలీ పుణ్యక్షేత్రమును దర్శించి, స్వామిని యర్చించి పెక్కు దానములు ఒసగినట్లు ఆయన వేయించిన శాసనముల నుండి తెలియుచున్నది. నంజుండేశ్వర స్వామి అంగరంగ వైభోగములకు కృష్ణదేవరాయలు కొన్ని గ్రామముల నొసగినట్లు తెలియుచున్నది. "ది ఇన్స్క్రిప్షన్ రిజిష్టర్స్ ఎ గిఫ్ట్ ఆఫ్ ఎ విల్లేజ్ బై కృష్ణదేవ మహారాయా, ది విజయనగర కింగ్ టు గాడ్ నంజుండేశ్వర. ఇటీజ్ డేటెడ్ శక 1449 సర్వజిత్తు, వైశాఖ, సు. 12, కరస్పాండింగ్ టు 1527 ఎ.డి., ఏప్రిల్ 13."

[వైడ్. ఎ, కార్నాటికా, వాల్యూం-3, నెం-251, పు-334]

రాయల పెద్ద రాణియైన తిరుమలదేవి పుట్టినిల్లు శ్రీరంగపట్టణమే కదా!

ఇంతవరకు జెప్పియుండిన వివరముల నుండి నంజనగుడి దక్షిణదేశమున నొక సుప్రసిద్ధమైన పుణ్యక్షేత్రమని తెలియుచున్నది.

నంజుండ శబ్దమునకు గల కొన్ని మారు రూపములు :

'నంజుండ శబ్దమునకు' నన్నయ యను మరియొక రూప మున్నదని నా గ్రంథములో విశదపరచి యున్నాను. ఇది పై శబ్దమునకు తద్భవ రూపమని చెప్పవచ్చును. నన్నయ యను పేరు పశ్చిమగంగ చక్రవర్తుల కాలమునకే వ్యాప్తిలోనికి వచ్చి స్థిరపడియుండెను. నంజుండేశ్వరుని ఆలయము "నన్నయ్యగుడి" (నన్నయ్యనగుల) యని ప్రసిద్ధికి వచ్చియుండెను. ఆ కాలమున పెక్కుమంది తల్లిదండ్రులు తమ బిడ్డలకు నంజుండయ్య అను పేరిడుటకు మారుగ నన్నయ్య అను పేరునే పెట్టుట వాడుకకు వచ్చెను. ఇట్లగుటకు కారణము 'నంజుండ' యను పేరు కంటెను, నన్నయ యను పేరు సరళమై, ఇంపై, ఉచ్చారణా సౌలభ్యము కలిగియుండుట యని చెప్పవచ్చును. కాఠిన్యమును వీడి సారళ్యము నన్వేషించుట మానవ స్వభావము కదా!

ఈ 'నంజుండ' యను నామధేయము యొక్క పరిణామము యింతటితో నాగలేదు. తల్లిదండ్రులు తమ పిల్లలకు 'నంజుండయ్య' లేక నన్నయ్య యని పేర్లు పెట్టినను, దైనిక వ్యవహారమున "నన్ని" యని పిలుతురు. ఇదియొక ముద్దు పేరు. ఈ సంప్రదాయము ననుసరించియే కృష్ణుడు కన్న

దైనాడు. విష్ణువు వెన్నుడైనాడు. నంజుండేశ్వరుడు "నన్ని" అయినాడు. మొట్టమొదట 'నన్ని' యని సుద్దుగా బిలిచిన క్రమ క్రమముగా నదియొక స్వతంత్రమైన పేరుగా నేర్పడినది. పిల్లలకు 'నన్ని' యనియే పేరు పెట్టబడుతూ వచ్చినదని తెలియుచున్నది. ఈ పేరు శాసనములలో గూడ చోటు చేసుకున్నది. ప్రాచీన కాలమున కర్నాటక రాజ్యమును యేలిన కొందరు రాజులకు 'నన్ని' లేక 'నన్న' యను పేరుండినటుల శాసనముల నుండి తెలియుచున్నది.

గంగరాజైన రెండవ పృథ్వీపతి కుమారుని పేరు 'నన్నియ గంగ' అనియుండెను. "పృథ్వీపతీస్ సన్ నన్నియ-గంగ, ఫాట్ ఇన్ ది ఆర్మీ ఆఫ్ బీరనొలంబ అసెన్ట్ ది సంతర కింగ్...."

[వైడ్. మై. గెజె. వాల్యూం-2. పార్ట్-2. పు-651]

ఈ వంశమునకు జెందిన రెండవ బుతగ రాజునకు 'నన్నియ' యను బిరుదుండెనట.... బుతగ 2 వూ ఫాట్ అండ్ స్లూ రాచమల్ల 3, నెక్ట్స అసెండెడ్ ది త్రోన్. హి వాజ్ ఆల్సో నోన్ యాజ్ బూతయ్య అండ్ బై హిజ్ డిస్టిన్క్టివ్ టైటిల్స్ 'నన్నియ-గంగ' గంగనారాయణ అండ్ గంగ గాంగేయ .."

[వైడ్. ఇబిడ్. పుట-670]

క్రీ.శ. 9-10 శతాబ్దాలలో నొలంబపాడి రాజ్యమును పాలించిన నొలంబరాజ దిలీపయ్య కుమారుని పేరు నన్నినొలంబ. ఇన్ 969, అకార్డింగ్ టు యాన్ ఇన్స్క్రిప్షన్ ఫ్రమ్ ముళబాగల్ టాలూక్ దిలీప్స్ సన్ "నన్నినొలంబ హాడ్ కమ్ టు ది త్రోన్...."

[వైడ్. మై గజెటీర్. కోలార్ డిస్ట్రిక్ట్. పు-44]

మరియొక నొలంబ రాజైన అయ్యప్పదేవ యనునతనికి 'నన్నిగ' అను మరియొక పేరుండెనని తెలియుచున్నది. "....వి హావ్ ఇన్స్క్రిప్షన్స్ బిలాంగింగ్ టు మహేంద్రాస్ సన్, బెస్ట్ డిస్టింగిష్డ్ యాజ్ అయ్యప్పదేవ ఆర్ నన్నిగ...."

[వైడ్. ఇబిడ్. తూకూర్ డిస్ట్రిక్ట్. పు-31]

ఇట్లే కాలచురి వంశమునకు జెందిన కొందరు రాజులకు కూడ 'నన్న' లేక "నన్ని" యను పేర్లుండినటుల దెలియుచున్నది. ఈ వంశమువాడగు 'శంకరగణ' యను రాజునకు నన్నరాజు జన్మించెను. "ఫ్రం హిమ్ శంకరగణ, వూస్ ఫేమ్ స్ప్రెడ్ అప్ టు ది ఓషన్ విచ్ ఈజ్ గార్మెంట్ ఆఫ్ ది అర్త్ స్ప్రింగ్ ది ఇల్లస్ట్రియస్ నన్నరాజ...." (సోపహిత వసుధా పావనోన్నరాజః)

[వైడ్. ఎ. ఐ. వాల్యూం-18. పు-136]

ఇట్లెన్నియో యుదాహరణములను ప్రాచీనకాలపు శాసనముల నుండి చూపవచ్చును. 'నన్ని' లేక 'నన్న' యను పేర్లు మూలరూపము నుండి విడువడి స్వతంత్ర నామములుగా ప్రసిద్ధికి వచ్చినవి.

కాని, 11-12 శతాబ్దములకావల యేమి కారణముననో కాని, ఈ 'నన్ని' శబ్దము యొక్క ప్రాముఖ్యము యాధి నుండి జారిపోయినది. ఈ పేర్లు కర్నాటక రాజ్యమునకే పరిమితమైయుండినట్లు తెలియుచున్నది. ఆంధ్రదేశములో అనంతపురము మరియు చిత్తూరు జిల్లా దక్షిణ తాలూకాలవారికి తప్ప దక్కిన ప్రాంతాలవారికీ పేరును గురించి తెలియదు.

ఈ నంజుండ, నన్నయ, నన్ని మొదలగు పేర్లను గురించి బొత్తిగ తెలియనందుననే కొందరు ఆంధ్ర పండితులు 'నన్న' 'నన్ని' పదములకు తమకు దోచిన అర్థములను జెప్పియున్నారు. అట్టివారిలో గొందరు ప్రముఖులగు వారి అభిప్రాయములను ఇట వ్రాయుచున్నాను.

(1) క్రీ.శ. 1911వ సంవత్సరమున వెలువడిన ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికా సంపాదకులీ పేరులను గురించి యిట్లు వ్రాసియున్నారు. వారు నందంపూడి శాసనమును గురించి వ్రాసిన వ్యాసమున గడపట యిట్లు వ్రాసియున్నారు.

"ఈ శాసన కావ్యమును రచించిన కవి నన్నియభట్టుగా నిందు పేర్కొనబడిన సకలభాషా వాగను శాసనుడగు నన్నయ భట్టారకుడు. నన్న శబ్దము పూర్వ మికారాంతముగా బ్రయోగింపబడుచుండినట్లిందువలన గనబడుచున్నది. నన్ని నారాయణుడనుచో విశేషణముగా వాడబడినది. నన్నిచోడడను నప్పుడు గూడ విశేషముగ గ్రహింపవలయును నన్ని శబ్దమునకు గన్నడభాషయందు ప్రియము, సుందరము అని యర్థము. అరవమునందు నన్ను శబ్దమునకును గూడ నిదియే యర్థము. తెనుగున 'ననుపు' శబ్దమునకు నీశబ్దమునకు సాజాత్యమూహ్యము." [చూ. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక సంపుటము-1, సంచిక-1, 1911].

ఆ తర్వాత పై వ్రాతను చూచి కాబోలు కీ.శే. ఉమాకాంత విద్యాశేఖరులు, నన్నయగారి పేరును గురించి "నన్న" అంటే అరవంలోనూ మరియు కన్నడములోనూ మంచి అని అర్థం.

"ఇది తెలుగులో లేనేలేదు" అని వ్రాశారు.... [చూ. పల్నాటి వీరచరిత్ర. పుట-5]

ఇట్లే మరికొందరు కూడ వ్రాసియున్నారు. ఇటీవల కీ.శే. శ్రీ నిడుదవోలు వేంకటరావుగారిట్లు వ్రాసియున్నారు. "నన్నయ భట్టు-నామరూప నిష్పత్తి" 'భారతములో నన్నయభట్టు' 'నన్న పార్య' [ఆది 1-9] అనియు, 'నన్నయభట్టు' [ఆది 1-25] అనియు నాశ్వాసాంత గద్యలలో 'నన్నయభట్టు' అనియు తనను గురించి పేర్కొనినాడు. ఆతడు వ్రాసిన వ్యాసములలో "కావ్యానాం కర్తా నన్నయ భట్టో" అనియు, "నన్నియ భట్టో" అనియు లిఖించినాడు. దీనినిబట్టి నన్నయభట్టు వేఱు, నన్నియ భట్టు వేఱు అనునొక విమర్శకాభిప్రాయము వెలువడినది. [చూ. భారతి. 1:వ సంపు. 1941]. ఇవి యెంతయు ప్రామాదికమను టకు సందియము లేదు. వ్రాతప్రతులకన్న శిలాశాసనము లెక్కుడు ప్రామాణికములు. కావున నన్నియభట్టు శబ్దము గ్రాహ్యమే. మఱియు శబ్ద వ్యుత్పత్తి ననుసరించి, ప్రాచీన నామ సామ్యమును బట్టి నన్నియ రూపము కూడ సరియైనది.... ప్రాచీన సంప్రదాయ ముల ననుసరించి ఇయాంత రూపములు సరియైనవి. కావున, నన్నయ, నన్నియలు వేఱుకారని స్పష్టమగుచున్నది.

నన్నియభట్టు అను సమాస పదములో నన్ని+అయ+ భట్టు అను మూడు పదములు గలవు. ఇందు, నన్ని అనునది దేశ్యము, అయ అనునది తద్భవము. భట్టు శబ్దము అదంతమైన సంస్కృత పుల్లింగ శబ్దము, తత్సమము. కాబట్టి నన్నయభట్టు అను పేరు తెనుగు పేరనియు గ్రహింపనగును.

నన్ని, నన్న పదములు ద్రవిడ, కర్ణాటక భాషలలో గలవు. ఆయా భాషలలో వీనికి మంచితనము, శీలము, ప్రియము, సత్యము మున్నగు అర్థములు గలవు. తెనుగున నన్ని పదము ప్రత్యేకముగ నీయర్థమున లేకున్నను, 'ననుపుకాడు' మొదలగు పదములలో నిందులో ప్రియము అనునర్థము గలిగియే యున్నది...."

[చూ. తెనుగుకవుల చరిత్ర. పుటలు-113, 114].

'నన్ని' లేక 'నన్న' నామోత్పత్తిని గురించి శ్రీ వేంకటరావుగారు కూడ వారి వెనుకటి యభిప్రాయమునే మరల చెప్పి యున్నారు.

ఇంతవరకు నన్న, నన్ని శబ్దములకు పండితులు చెప్పి యుండు అర్థములు పొసగవు. అది కేవల మూహాజనితము. ఆ పదముల యొక్క అసలు చరిత్రము తెలియనందున, నెట్లయినను నొకవిధముగ అర్థము చెప్పవలయునను పట్టుదలతో జేసియుండు ప్రయత్నము మాత్రమే. నన్నయభట్టు మరియు నన్నినారాయణుడు అను పేరులలో గల నన్నశబ్దము విశేష్యమే కాని, విశేషణము కాదు. అది ద్వంద్వ సమాసము.

పై పంక్తులలో నేను చెప్పియుండు వివరముల నుండి ఆంధ్ర కుమారసంభవ కృతికర్త పేరు "నన్నిచోడుడు" లేక "నన్నచోడుడు" అనియో యుండవలయును. కాని "నన్నెచోడుడు" అని యుండుటకు వీలులేదు. కుమారసంభవ గ్రంథమును క్రీ.శ. 910వ సంవత్సరమున మొట్టమొదట ప్రకటించిన కీ.శే. శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు "నన్నిచోడుడు" అనియే చెప్పియున్నారు.

ఆవల నీ గ్రంధమును మదరాసు విశ్వవిద్యాలయము తరపున పరిశోధించిన కీ.శే. శ్రీ కోరాడ లక్ష్మీపతిశాస్త్రిగారీ కవిని, "నన్నిచోడదేవ" యనియే చెప్పియున్నారు.

క్రీ.శ. 1924వ సంవత్సరమున నీ కవిని గురించి యొక్క విమర్శన వ్యాసమును వ్రాసిన కీ.శే. నడకుదుటి వీరరాజుగారు సయితము "నన్నిచోడకవి రాజశిఖామణి" యనియే చెప్పి యున్నారు. కీ.శే. శ్రీ దేవరపల్లి వేంకట కృష్ణారెడ్డిగారు "కవి రాజశిఖామణి నన్నిచోడుడు" అనియే చెప్పియున్నారు.

కాని, ఆవల నీ కవిని గురించి వ్రాసిన వారందరు 'నన్నెచోడుడ'నియే వ్రాసియున్నారు. ప్రస్తుతము నన్నయ నామధేయము యొక్క పుట్టుపూర్వోత్తరములు స్పష్టముగాను, ఆధారపూర్వకముగాను తెలిసినందున నికమీదట వ్రాయువారైనను నన్నెచోడుడని వ్రాయు పద్ధతికి స్వస్తి చెప్పుట మంచిదని మనవి చేయుచున్నాను.

ఇట్లు, ప్రాచీనాంధ్ర కవులను గురించియు, గ్రంథములను గురించియు సరియైన వివరములు తెలియక ఊహలపై నాధారపడుటకు కారణము, ఆంధ్రుల రాజకీయ చరిత్రను సమగ్రముగను, సప్రమాణముగను వ్రాయకుండుటయే. ఒక దేశము యొక్క సాహిత్య మరియు సాంఘిక చరిత్ర ఆ దేశపు రాజకీయ చరిత్రముపై నాధారపడియుండును. ప్రాచీనాంధ్రుల చరిత్ర అతి విశాలమైనది. ఆంధ్రులు చాలాకాలము ఆసేతు శీతాచల పర్యంతము పాలించినారు. ఉత్తరమున మగధ సామ్రాజ్యమును హస్తగత మొనరించుకొని పాలించినారు. ఒకప్పుడు ఆంధ్ర

రాజ్యము నేపాళము వరకు వ్యాపించియుండెను. శాతవాహన చక్రవర్తుల వంశమునకు జెందిన శాఖవారు పంజాబులో గూడ పరిపాలనము గావించిరని ఆ దేశ చరిత్ర గ్రంథముల నుండి తెలియుచున్నది. ఈ కారణమును బట్టి ఆంధ్రుల భాష, సంస్కృతి యెక్కడెక్కడనో నెలకొన్నది. నేడు ఆ ప్రాచీన చిహ్నములు అజ్ఞాత వాస మొనర్చుచున్నవి. వానిని పరిశోధించి, ఆ విషయములను వెలుగులోనికి దేవలసియున్నది. అందువల్లనే నన్నయ మరియు నన్నెచోడులు దక్షిణ ప్రాంతములలో జన్మించుట, నివసించుట దటస్థించినది. కొన్ని సంవత్సరములకు ముందు కీ శే. పరచూరి వేంకట సుబ్బయ్య చౌదరిగారు నన్నయ గారి కవిత్వంలోని యతులను "నన్నియ జాతులు – కొన్నిటి రీతులు" అను శీర్షిక క్రింద వివరించి, కడపట ఆతని పేరును గురించి యిట్లు వ్రాసియున్నారు. "నన్నయ యనియే విశేషముగా వ్యవహారమున్నను శీర్షికకు ననుసత్వంబు నాపాదింప దలంచి 'నన్నియ' యని వాడియుంటిని. 'నన్నియ' యనియు వ్యవహరించువారు గలరు గదా?"

[భారతి. సంవత్సరాది సంచిక. 1936. పు-99, 100]

అసలు విషయము తెలియనందున నిట్లు వ్రాయవలసి వచ్చినది. కాని, కీ.శే. ఉమాకాంతముగారు, నిరాధారముగ నన్నయ గారు ఆంధ్రుడు కాడను భావమును తమ మనస్సులో సృష్టించుకొన్నారు. అది వారికి నన్నయగారిపట్ల గాఢమైన ద్వేషము గల్గించినది. ద్వేషము దూషణకు దారి తీసినది. ద్వేషపూరిత మనస్కుడైన ఆతనికి, నన్నయగారు ఆంధ్ర భాషకు, సాహిత్యానికి జేసిన మహోపకారము గ్రాహ్యము కాకపోయినది. నన్నయ భారతమును యెంతో గొప్పగ ప్రశంసించిన తిక్కన, ఎఱ్ఱన, శ్రీనాథాది మహాకవుల సహేతుకమైన ప్రశంసలను సైతము శ్రీ ఉమాకాంతముగారు గమనించకపోయినారు. నిర్మలమైన, శాశ్వతమైన నన్నయగారి కీర్తికి కళంక మాపాదించుటకు జేసిన వారి వ్రాతలు నన్నయగారికి గాక, వారి కీర్తికీ తీరని కళంకమును గలిగించాయి. కాన శ్రీ ఉమాకాంతముగారి అభిప్రాయము కడు కఠోరమైనది. అన్యాయమైనది. మిగుల అపాయకరమైనది.

నేడు కొందరు ప్రస్తుతపు సంకుచిత రూపమునున్న తెలుగుదేశపు ఎల్లలలోనే జన్మించి, పెరిగి పెద్దవారై గ్రంథ రచన చేసినవారు మాత్రమే తెలుగు కవులను భ్రాంతిని, నమ్మకమును విడనాడవలసి యున్నది. నన్నయభట్టు ప్రాచీన శ్రీరంగ పట్టణ రాజ్యమున తెలుగు స్మార్త కుటుంబమున జన్మించి, విద్య నభ్యసించి, చారిత్రక కారణాలను పురస్కరించుకొని, అదృష్టము కలిసిరాగా రాజమహేంద్రవరమును జేరి, తూర్పు చాళుక్య నరపాలురకు కులబ్రాహ్మణుడై, తెనుగున మహాభారతమును రమణీయముగ రచించి, ఆంధ్ర భాషను రక్షించెనుట ముమ్మాటికి నిక్కము. యథార్థ మిట్లుండగా కీ.శే. శ్రీ ఉమాకాంతముగారు, నన్నయగారు 'అనాంధ్రుడ'ని వ్రాసియుండుట కఠోరమైన విషయము. ఈనాడు స్పష్టముగా దెలియని ప్రాచీన చారిత్రక విషయములను గురించి కాని, సాహిత్య విషయములను గురించి కాని, తుది తీర్మానము చెప్పుటకు బూనుకొనుట సాహసము, మరియు అపాయకరము.

ఇక నన్నయగారి సహాధ్యాయుడని చెప్పబడియుండు నారాయణభట్టును గురించి నాకు దెలిసిన విషయములను వ్రాసెదను.

నారాయణభట్టు :

ఆంధ్ర భారత రచనలో నన్నయభట్టుకు నారాయణభట్టు మిగుల దోడ్పడెనని, పై భారత ముద్రిత ప్రతులలోనున్న క్రింది పద్యమునుండి తెలియుచున్నది.

"పాయక పాకశాసనికి-భారత ఘోర రణంబునందు నా
రాయణుడట్లు వానస ధరామర వంశ విభూషణుండు నా
రాయణ భట్టు వాఙ్మయ ధురంధరుడున్ తన కిష్టుడున్ సహా
ధ్యాయుడునైనవా డభిమతంబుగ దోడయి నిర్వహింపగన్."

[భా. ఆ 1-26]

దీనినుండి నారాయణభట్టు, నన్నయకు సమకాలికుడు; ఆతనికి సహాధ్యాయుడు మరియు నిష్టుడని తెలియుచున్నది.

కాని, యీ పద్యము నేడు లభించియుండు నన్నయ భారతమునకు గల తాళపత్ర గ్రంథములలో గొన్నిటి యందున్నది; మరికొన్నిటియందు లేదు. ఆంధ్ర భారతమును సంశోధింపజేసి, ఉస్మానియా విశ్వవిద్యాలయమువారు ప్రచురించియున్నారు. వారు నన్నయ భారత ప్రతులను దక్షిణ దేశమున వేర్వేరు ప్రాంతముల నుండి పెక్కు ప్రతులను సేకరించినారు. ఆ ప్రతులలో నీ పద్యము లేనివి 14; ఇదియున్న ప్రతులు 10 అని తెలియుచున్నది. ఆంధ్ర సాహిత్య పరిషత్తువారు పిఠాపురమ్ము, కాకినాడ ప్రాంతముల నుండి సంపాదించిన ప్రతులలో గూడ నీ పద్యము లేదు. ఇంకను, మైసూరు దేశము, అరవ దేశము

లందు లభించగల ప్రతులను సేకరించి చూచినయెడల పై పద్యమీ ప్రాంతములందు గల ప్రతులలో లేదని తెలియుచున్నది. హోసూరు ప్రాంతమున లభించిన యొక ప్రతి నా యొద్ద నున్నది. కాని, దానియందు గూడ నీ పద్యము లేదు. కావున, పై పద్యము లేని ప్రతులే చాలా యెక్కువ యనియు, ఉన్న ప్రతులు చాలా తక్కువ యనియు దేలుచున్నది.

అప్పకవీయ కర్తకు లభించిన భారత ప్రతియందీ పద్య మున్నట్లా గ్రంథమునుండి తెలియుచున్నది. ఆతడు క్రీ.శ. పదునేడవ శతాబ్ది మధ్యభాగమున (1650) నుండినవాడని కవి చరిత్ర గ్రంథములనుండి తెలియుచున్నది. ఆతడు నిత్య సమాస యతికి జెప్పియుండు ఉదాహరణములలో నీ పద్యమొకటి. దీనిని బట్టి అప్పకవి కాలమునకు ముందుండిన భారత ప్రతులలో గొన్నింటియందీ పద్యముండెనని తెలియుచున్నది. శ్రీ వేంకట రావుగారు చెప్పియుండినట్లు అప్పకవికి పూర్వము వ్రాయబడిన భారత ప్రతులు నేడు లభించలేదు. అప్పకవికి ముందెంత కాలము నుండి కొన్ని ప్రతులలో నీ పద్యముండెనో, ఎన్నింటియందీ పద్యము లేకుండెనో నేడు తెలిసికొనుటకు వీలు గాదు. ఈ విష యము లన్నింటిని బట్టి జూచిన పక్షమున పై పద్యము నన్నయ వ్రాసిన భారత గ్రంథములో నుండలేదనియు, యావల నిది కొన్ని ప్రతులలోనికి వచ్చియుండవచ్చుననియు తేలుచున్నది.

లేఖకుని పొరపాటు :

నన్నయ వ్రాసిన భారత గ్రంథమును జూచి మొట్టమొదట ప్రతి వ్రాసుకొన్నవాడేదైనా పొరపాటుచేత నీ పద్యమును వదలి వేసియుండవచ్చుననియు, పిదప ఆ ప్రతిని జూచి వ్రాసుకొన్న వారాలాగే వ్రాసికొని యుండవచ్చుననియు నూహించుట కవకాశ మున్నది. అటులైన నేడు లభించియుండు భారత ప్రతులన్నింటి యందు నీ పద్యము లేకనేయుండును. కాని, నేటి ప్రతులలో గొన్నింటియందీ పద్యమున్నది కదా!

కావున, నన్నయ భారతమును జూచి ఆనాడే, కొంతమంది యైనా ప్రతులు వ్రాసుకొనియుంటారు. దీనిని బట్టి నన్నయ భారతమందీ పద్యముండి యుండునని చెప్పవచ్చును. అట్లుండిన పక్షమున ప్రతులు వ్రాసుకొన్న కొందరికి మాత్రమీ పద్యము గనబడి, మరికొందరికి కనబడక పోయినదని చెప్పవలసి వచ్చును. కాని, ఇది సరికాదు. కావున, కొందరు ప్రతిని వ్రాసు కొన్నప్పుడు, మూలప్రతిలో నీ పద్యము లేకయుండి ఆవల వ్రాసుకొన్నవారి కాలములో నీ పద్యముండియుండునని జెప్ప వచ్చును. ఈ యూహను సహేతుకముగా వివరింపవలసి వచ్చును. ఈ రెండునుకాక మూలగ్రంథమునకు నన్నయగారి సమీపకాల మందో లేక ఆతడు జీవించియుండిన కాలమందో ప్రతిని వ్రాసుకొన్నవాడీ పద్యమును యందు జేర్చెననియు, యా ప్రతిని జూచి వ్రాయబడిన ప్రతులన్నింటియందును నీ పద్యము జేరిపోయినదనియును చెప్పవచ్చును. నన్నయను అనాంధ్రుడుగా జిత్రించిన శ్రీ ఉమాకాంత విద్యాశేఖరు లిట్లు వ్రాసియున్నారు.

"పాయక పాకశాసనికి" యను బద్యము :- "ఆంధ్ర మహాభారతాది పర్వపు అవతారికలో నన్నయ భారతాంధ్రీకరణ ప్రయత్నమున దన్నెదుర్కొన్న క్లేశములను వానిని దానుత్త రించిన విధమును పై "పాయక పాకశాసనికి" అను పద్యమున సూచించెనని జెప్పవచ్చును. కీ శే. పింగళి లక్ష్మీకాంత కవిగారు సైతమిట్లే వ్రాసినను, మరియొకచోట బరిష్కర్తలీ పద్యము "అన్వయ పుగుటలేదు" అని కూడ చెప్పియున్నారు.

సుప్రసిద్ధాంధ్ర పండితులు కొందరు సయిత మీ పద్యము నన్నయగారి రచనయే యని నమ్మియున్నారు.

కీ.శే. పింగళి లక్ష్మీకాంతం కవిగారీ పద్యము నన్నయగారిదే యని విశ్వసించుటతోబాటు, దీనిని గురించి మరియు నిట్లు వ్రాసి యున్నారు. "...... నారాయణభట్టు చేసినది రచనలో ఏదో కొంచెపు మాటమాత్రపు సహాయమే అయినచో నీ పద్యములోని యుపమానమే నిరర్థకమగును... నారాయణభట్టు గంటమును బట్టి సహాయము చేసి సారథ్యము నడపెను. యుద్ధారంభము నుండి కవికి ఆ సహాధ్యాయుడు చేదోడు వాదోడుగా సహాయము చేయ బట్టియే కృతజ్ఞతా పూర్వకమైనట్టి మాటలు నన్నయ నోట వెలు వడినది. అదియెంతయో సార్థకమైన పద్యము ..."

[చూ. ఆంధ్ర సాహిత్య చరిత్ర. పు-48]

వీరికి బూర్వము, నందంపూడి శాసనమును గురించి, ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలో నొక పెద్ద వ్యాసము ప్రచురింప బడినది. ఆ వ్యాసమును వ్రాసినవారు కీ.శే శ్రీ జయంతిరామయ్య పంతులుగారు. వారు సుప్రసిద్ధ శాసన పరిశోధకులు. వారు కూడ నన్నయయే యీ పద్యమును వ్రాసెనని యిట్లు చెప్పియున్నారు. "ధరామర వంశ విభూషణుండు నా। రాయణభట్టు వాఙ్మయ ధురంధరుడుం దన కిష్టుడున్ సహా। ధ్యాయుడునైనవా డభి మతంబుగ దొడయి నిర్వహింపగన్" అని నన్నయ భట్టారకునిచే బేర్కొనబడిన నారాయణ భట్టితడే యనుటకు సందేహము కాను

పింపదు... [చూ. ఆం. సా. ప. పత్రిక, 1911, సంపుటి-1, సంచిక-1, పుట-53]

ఇంక, యిటీవలి ఒక పండితుని అభిప్రాయము చెప్పవలసి యున్నది. "వ్యాస భారతము-నన్నయ పరిష్కారము" అనునొక సిద్ధాంత గ్రంథమును వ్రాసిన డా॥ జొన్నలగడ్డ మృత్యుంజయ రావుగారిట్లు వ్రాసియున్నారు. "నారాయణభట్టు కూడ.... నన్నయకు చేదోడు వాదోడుగానుండి యాంధ్ర భారత రచనము రసవంతముగా సాగునట్లు వ్రాయబడి యుండవచ్చును....

[చూ. పుట-19]

ఇట్లు కొందరు పండితులీ పద్యము నన్నయదే యని చెప్పి యున్నను, మరికొందరిది నన్నయ రచితము కాదని తలంచి యున్నారు. ఇంతేకాక, యీ పద్యమున్న చోటు, సందర్భమునకు అన్వయ మగుటలేదని పెక్కుమంది పండితులు తలంచి యున్నారు. ఈ పద్యము నన్నయ్యది కాదనుటకు పైని తెలిపిన పండితులు మూడు కారణములను చెప్పియున్నారు. అవి 1) పెక్కు తాళపత్ర ప్రతులలో నీ పద్యము లేకుండుట 2) అప్పకవి యీ పద్యమును నన్నయ చెప్పని నిత్య సమాస యతికి ఉదాహరణముగా జెప్పియుండుట. 3) నన్నయ తరువాత తెలుగు కవులెవ్వరును నారాయణభట్టును పేర్కొనకయుండుట. కావున, నీ పద్యము ప్రక్షిప్తమైయుండునని చెప్పబడియున్నది. కావున, నీ విషయములను బరిశీలించవలసి యున్నది.

నన్నయ భారతమును ఆ కాలపు లిపియందు వ్రాసి యుండెను. ఆ సమయమున దానికి ప్రతులు వ్రాసికొన్నవారా లిపియందే వ్రాసుకొనియుంటారు. కాని ఆవల, ఆ లిపి క్రమేణ మారిపోయినది. ఆ లిపిల్లోని గ్రంథమును జూచి, మారిన లిపిలో మొట్టమొదటి ప్రతి వ్రాసుకొన్నవాడేమైనా పొరపాటుచేత నీ పద్యమును వదలివేసి యుండవచ్చుననియు, పిదప నీ ప్రతిని జూచి వ్రాసుకొన్న వారావిధముగనే వ్రాసికొన్నందున ఆ పద్యము గనబడుకున్నదనియు దలంపవచ్చును. కాని ఈ కారణము విశ్వసనీయము గాదు. నేటి కాలమువలె గాక, ఆ కాలమందు పండితులు నిష్ఠాగరిష్ఠులు. ఎంతో భక్తి శ్రద్ధలతో వ్రాసుకొనెడివారు. అట్టివారీ పద్యమును వదలి వేసియుందురనుట పొసగదు. మరికొన్ని ప్రతులయందీ పద్యముండుటను బట్టి నన్నయయే ఈ పద్యమును వ్రాసియుండవచ్చునని చెప్పవచ్చును. కాన, నిట్లు రెండు విధములుగా నేర్పడియుండుటకు నింకను బలవత్తరమైన కారణము లను కనుగొనవలయును.

ఈ విషయమును గురించి కీ.శే. శ్రీ నిడుదవోలు వేంకట రావుగారిట్లు వ్రాసియున్నారు. ఈ పద్యము పెక్కు భారత ప్రతులయందు కన్పట్టకున్నను, క్రీ.శ. 1656 సంవత్సరమున అప్పకవి తాను రచియించిన అప్పకవీయములో నిత్య సమాస విశ్రాంతిలో నారాయణ శబ్దమున కుదాహరణముగా నిచ్చి యున్నాడు. కాబట్టి అప్పకవికి ముందు భారత ప్రతులలో నిది యుండవలెను. కాని, నేడు మనకు అప్పకవి కాలముకంటె ముందు వ్రాయబడిన భారతప్రతులు లభింపవు. కాబట్టి ఈ విషయమై యిదమిత్థమని చెప్పజాలము.... నారాయణభట్టును తెలుగు కవులెవ్వరును స్తుతించియుండలేదు. అప్పకవి ఈ పద్యమును ఉదాహరించుటయే కాక, ఆంధ్ర శబ్దచింతామణిని కూడ నీతని సహాయముచే రచియించెనని గ్రంథావతారికలో చెప్పి యున్నాడు. అప్పకవి యిట్లు వ్రాయుటచేత, పై పద్యము నన్నయ వ్రాసియుండెనా? లేక అప్పకవియే ఆంధ్ర శబ్దచింతామణి కర్తృత్వము నన్నయకు స్థిరపరచుటకు నీ పద్యము సృష్టించెనా? అనెడు అనుమానము దృఢమగుచున్నది.... అప్పకవీయము రచనకు తరువాత నా గ్రంథమే ప్రమాణమగుట వలన, నొక్క భారతమునందే కాక, తక్కిన గ్రంథములలోని పాఠములు కూడ నప్పకవీయము ననుసరించియే తరువాతి వారు వ్రాయ జొచ్చిరి...."

[చూ. తెనుగు కవుల చరిత్ర, పుట-158, 159]

ఇట్లు వ్రాసిన కొన్నేళ్ళ కావల యీ విషయమును గురించి, శ్రీ వేంకటరావుగారు భారతి మాసపత్రికలో నిట్లు చెప్పియున్నారు. "పై పద్యమును అప్పకవి నిత్యసమాస విశ్రాంతుల కుదాహరణముగా నిచ్చియున్నాడు. అతని కాలము కూడ మనకు స్పష్టము. అది 1656. అంతకుముందు నన్నయ భారతమున మనకీ పద్యమున్నట్లు లాక్షణిక నిదర్శనములు లేవు. అనగా లాక్షణికులెవ్వరును తెలుపలేదు. అందువలన అప్పకవియే దీనిని రచియించి తన గ్రంథమున లక్ష్యముగా చేర్చెననుటను మనము నిర్ణయించుటకు అవకాశమున్నది. అది యీ క్రిందివానిచే నిశ్చితమగుచున్నది. సంశోధిత ముద్రణమున కుపయోగింపబడిన తాళపత్ర ప్రతులలో "ఓ" అను ప్రతి అన్నింటికన్నా పూర్వముది. దాని లేఖన కాలము 14-7-1654. ఈ ప్రతిలో "పాయక పాకశాసనికి" అన్న పద్యము లేదు. అప్పకవి కాలము 1656. కావున అప్పకవియే దీని రచయిత. అప్పకవి పై పద్యమును నిత్య సమాస యతికి లక్ష్యముగా నిచ్చుచు, నన్నయయే రచించినట్లు తోపింప జేయుటకు మెలకువతో "నిర్వహింపగన్" అను అసమాపక

క్రియతో రచించి చేర్చినాడు. దానితో అది నన్నయ భారతమున నతుకుకొన్నది. అప్పకవి తరువాత లేఖకులు (క్రీ.శ. 1656కు తరువాతవారు) అది నన్నయ పద్యమే యని, నన్నయ పద్యము వెనుక అనన్వితముగా వ్రాసిరి. సాహిత్య ప్రపంచమున నన్నయ కాలము క్రీ.శ. 1050 మొదలుకొని అప్పకవి కాలము క్రీ.శ. 1656 వరకు ఏ కవియు నన్నయతో నారాయణభట్టును పేర్కొనలేదు. అప్పకవి వరకు నారాయణభట్టు ప్రశంసయే గన్పట్టదు.

[చూ. భారతి 1976 జూన్]

పై పంక్తుల నుండి "పాయక పాకశాసనికి" అను పద్యమును అప్పకవియే వ్రాసెనన్న శ్రీ రావుగారి యభిప్రాయము తెలియుచున్నది. అందువలన నీరి అభిప్రాయము నిజమైనదేనా? విశ్వసింపదగినదేనా అనుటను పరిశీలింపవలసి యున్నది.

## ఈ పద్యమును అప్పకవి వ్రాసెనా?

అప్పకవికి క్రీ.శ. 1656 ప్రాంతమున దొరకిన ప్రతియందీ పద్యమున్నది. ఇంచుమించుగ ఆ ప్రాంతము నాటిదేయైన మరియొక ప్రతియందీ పద్యము లేదు. దీనినిబట్టి పై రెండు ప్రతులు వ్రాసుకొన్న వారికి లభించిన మూల ప్రతులొక్కటి కావు అని తెలియుచున్నది కదా! ఇట్లుండగా 1654వ సంవత్సరపు ప్రతియందు లేదనుటనుబట్టి, 1656వ ప్రతియందును లేదని యెట్లు చెప్పవచ్చును? అప్పకవియే ఈ పద్యమును వ్రాసెనను అభిప్రాయము శ్రీ వెంకటరావుగారికి స్థిరమై యుండినందున, వారీ విధముగ జెప్పియున్నారు కాని వేరు కాదు. ఇంచుమించుగ నొకే కాలమందు దొరికిన ప్రతులనుబట్టి యప్పటికే రెండు విధములగు అభిప్రాయములు వ్యాప్తియందుండెనని తెలియుచున్నది.

అప్పకవియే ఈ పద్యమును వ్రాసెనను వెంకటరావుగారి యభిప్రాయమును వాదము కొరకు యంగీకరించినను అప్పకవికి నారాయణభట్టు పేరెట్లు తెలిసినది? అప్పకవికా పేరు నందంపూడి శాసనము నుండి తెలిసియుండు ననుకొనవలయును. నారాయణభట్టు పేరు నందంపూడి శాసనమందు తప్ప మరియెక్కడను లేదు. కాని, అప్పకవి కాలమునకు సుమారు ఆరువందల యేండ్లకు ముందు రాజమహేంద్రవరమున వ్రాయబడిన ఆ శాసనము అప్పకవికి యెట్లు తెలిసెను? ఆ శాసనముండు విషయ మీనాడు కదా మనకు తెలిసినది నేటి చరిత్ర పరిశోధకులెంతో శ్రమించి ప్రయత్నించగా గత శతాబ్దములో నిది దొరకినది. ఆ శాసనమందుండిన ఆనాటి లిపిని చదివి కిల్‌హార్న్ అను జర్మనీ దేశీయ విద్వాంసుడు కదా దీనిని ప్రకటించెను. నందంపూడి శాసనములోని విషయము తెలియకపోయిన నారాయణభట్టు పేరెట్లు తెలియును? దీనికి మార్గాంతరము లేదు కదా? ఒకవేళ తెలిసియున్నను, ఆ నారాయణభట్టు నన్నయకు భారత రచనలో దోడ్పడెననుట తెలియుటెట్లు? ఆ శాసనమందీ విషయము లేదు కదా! 'పాయక పాకశాసనికి' అను పద్యమును, నందంపూడి శాసనమును రెంటిని చూచినందువల్లనే కదా! ఆ నారాయణులిరువురు నొకరై యుందురను భావము, మరియు శాసనములో చెప్పబడియుండు నారాయణభట్టే యీ నారాయణభట్టను విషయము నేడు తెలిసినది. కావున, నారాయణభట్టు పేరు అప్పకవికి తెలియదు. తనకు దొరికిన ప్రతియందా పేరున్నందువలననే ఆతనికి తెలిసినది. లనియెడల నన్నయ మరియొక పండితుని సహాయమును బొందెననియు, ఆతని పేరు నారాయణభట్టు అనియు దెలిసికొనుట కెంతమాత్రము వీలుకాదు. కావున పై విషయములను బట్టి ఆలోచించిన పక్షమున అప్పకవికి దొరికిన ప్రతియందీ పద్యముండెననుట నిజము. కావున ఆ కాలమునాటికే యీ పద్యము గల ప్రతులు, లేని ప్రతులు దేశమునందుండెనని గట్టిగ చెప్పవచ్చును.

వేర్వేరు ప్రాంతములనుండి మహాభారత ప్రతులను సేకరించి పరిశోధించిన పండితులకు లభించిన నన్నయ భారత ప్రతులలో నీ పద్యము లేని ప్రతులు 14. ఉన్నవి 10 అని తెలియుచున్నవి. ఈ పరిశోధకుల వ్రాత ప్రకారము, తెలంగాణా ప్రాంతము నుండి వచ్చిన ప్రతులలో గూడ నీ పద్యము లేదు. ఈ ప్రతులను వ్రాసికొన్నవారెవరికీ, అప్పకవి గ్రంథము తెలియదనియు, వారికి దొరికిన మూల ప్రతులలో నీ పద్యముండలేదని చెప్పవలసియున్నది. కాన, పై పద్యమును అప్పకవి వ్రాయలేదనియు, ఆతని కాలమునకు ముందే నిది ప్రక్షిప్తమైయుండెననియు దెలియుచున్నది.

## "పాయక పాకశాసనికి" పద్యము నెవరు వ్రాసిరి?

ఉ॥ పాయక పాకశాసనికి-భారత ఘోర రణంబునందు నా
రాయణు నట్లు తానును ధరామర వంశ విభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయ ధురంధరుడున్ తనకిష్టుడున్ సహా
ధ్యాయుడునైన వాదభిమతంబుగ దోడయి నిర్వహింపగన్.

ఇది, కీ.శే. గురజాడ శ్రీరామమూర్తిగారి 'కవి జీవితము' నందున్న పాఠము. గురజాడవారి, పై గ్రంథ రచనకు బిదప క్రీ.శ. 1923వ సంవత్సరమున కీ.శే. సరస్వతీ తిరువేంగడా

చార్యులు ప్రచురించిన శ్రీమదాంధ్ర భారతము ఆదిపర్వమునందీ పద్యము పై విధముగనే యున్నది.

ఆ పిదప వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్ వారు ప్రచురించిన ఆదిపర్వమునందు మొదటి మూడు పాదములు పై పాఠమువలెనే యున్నది. కాని, నాలుగవ పాదమునందు గొంత మార్పున్నది.

"ధ్యాయుడు నైనవాడభిమత స్థితి దోడయి నిర్వహింపగన్."

ఆ పిదప కీ.శే. నిడుదవోలు వేంకటరావుగారి 'తెనుగు కవుల చరిత్ర' యందీ పద్యమిట్లున్నది.

ఉ॥ పాయక పాకశాసనికి భారత ఘోర రణంబునందు నా
రాయణుడట్లు వానస ధరామర వంశ విభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయ దురంధరుడున్ తనకిష్టుడున్ సహా
ధ్యాయుడునైన వాడభిమతంబుగ దోడయి నిర్వహింపగన్.

[చూ. పుట-158]

కీ.శే. ఆచార్య పింగళి లక్ష్మీకాంతం కవిగారిట్లు వ్రాసిచ్చి యున్నారు.

ఉ॥ పాయక పాకశాసనికి భారత ఘోర రణంబునందు నా
రాయణునట్లవారణ ధరామర వంశ విభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయ ధురంధరుడుం దన కిష్టుడున్ సహా
ధ్యాయుడునైన వాడభిమతస్థితి దోడయి నిర్వహింపగన్.

[చూ. ఆంధ్ర సాహిత్య చరిత్ర. పు-45]

ఇటీవల 'వ్యాస భారతము-నన్నయ పరిష్కారము" అను బృహద్గ్రంథమును వ్రాసిన డా॥ జొన్నలగడ్డ మృత్యుంజయరావు గారు గురజాడ వారిచ్చుయుండు పాఠమునే గ్రహించియున్నారు.

ఇటీవల భారత గ్రంథము యొక్క పెక్కు ప్రాచీన ప్రతులను పరిశోధించి ఉస్మానియా విశ్వకళా పరిషత్తువారు నన్నయగారి భారతమును ప్రచురించినారు. వారికి లభించిన భారత (ఆదిపర్వ) ప్రతులలో కొన్నిటియందీ పద్యమున్నది. కొన్నిటియందు లేదు. ఉన్న ప్రతులలో గూడ పై పద్యము రెండవ పాదమందు "బాణస ధరామర...." యనియు, గొన్నిటి యందు 'వాసిగ' యనియు నున్నది.

అందువల్లనే నేడు మనకు రెండు రకముల ప్రతులు దొరకుచున్నవి. కాని, పై పద్యమును అప్పకవి వ్రాయలేదని చెప్పవచ్చును, ఇట్లు చెప్పుటకు మరియొక కారణము కూడ గలదు. అప్పకవికి దొరికిన ప్రతి యందీ పద్యముండలేదనియు, ఆవల నీ పద్యము నాతడే వ్రాసి చేర్చెనను రావుగారి అభిప్రాయమును వాదముకొరకంగీకరింతము. దీనివలన దేలు విషయమేమి? నారాయణభట్టు పేరు అప్పకవికి తెలిసియుండదు. నారాయణభట్టు అనువాడే నన్నయకు దోడ్పడెనని ఊహించుటకు సాధ్యము కాదు. అట్లూహించుటకు యాతనికి నారాయణభట్టు విషయము తెలిసియుండవలయును. అట్లు తెలిసికొనుటకు నందంపూడి శాసనము దప్ప వేరొండు మార్గము తెలియదు. నందంపూడి శాసనము వేయించి, అప్పటికి ఆరువందల ఏళ్ళయి యుండెను. అందువలన ఆ శాసనము ఆతనికి లభించలేదు. రాజరాజు నందంపూడి యను గ్రామమును నారాయణభట్టు అనువారికిచ్చి యుండెనను విషయము అప్పకవికి తెలియదు. కావున, నన్నయకు భారత రచనలో తోడ్పడినవాడు నారాయణభట్టే యని వ్రాయుటకు అప్పకవికి సాధ్యము కాదు. ఆతనికి దివ్యదృష్టి లేదు. కావున, పై పద్యము అప్పకవి కాలమునకు ముందునుండియే ప్రక్షిప్తమై యుండెను. కొన్ని ప్రతులలో నీ పద్యముండుటయు, మరికొన్నిటి యందు లేకుండుటయు ఆ కాలమందే తటస్థించియుండెను.

పై పద్యము కొన్నిటియందుండి గొన్నిటియందు లేకుండుటను బట్టి, అది నన్నయగారి కాలమందే కాక, ఆ సమీప కాలమందే జరిగియుండునని చెప్పవచ్చును.

మొదటి ఊహ :

నన్నయకు భారత రచనయందు ఆతని సహాధ్యాయుడైన నారాయణభట్టు మిక్కిలి తోడ్పడియుండవచ్చును. ఒకనాడతడును, నారాయణభట్టును, మరికొందరు వారి మిత్రులును కలసి మాట్లాడుతున్నప్పుడు భారత రచనను గురించి చర్చ జరిగియుండును. ఆ సమయమున తన సహాధ్యాయుని సహాయమును ప్రశంసించడం కోసం నన్నయగారీ పద్యమును చాటువుగా చెప్పియుండవచ్చును. దానిని విన్నవారెవ్వరో నారాయణభట్టు మీద అభిమానముతో తమ వద్దనున్న ప్రతిలో జేర్చియుండవచ్చును.

లేక యిట్లు కూడ జరిగియుండును. భారత రచన ప్రారంభమునాటికే నన్నయగారికి వయసు చాలా మళ్ళియుండినది. భారత రచనకు కొన్ని సంవత్సరములు పట్టియుంటుంది. ముదిమిచేత యాతడు రాజరాజు మరణించుటకు ముందే మరణించి యుంటాడు. అనగా క్రీ.శ. 1060వ సంవత్సరమునకు ముందే మరణించి యుంటాడన్నమాట.

నారాయణభట్టు నన్నయగారి సహాధ్యాయుడు కాన, యించుమించుగ నన్నయగారి వయస్సే కలిగియుంటాడు. అతడు సయితము నన్నయ్యకు కొంత ముందో, ఆవలనో మరణించియుంటాడు. ఆతని మరణానంతర మాతని కుమారుడో లేక ఆతని అభిమానులో భారత రచనకు నారాయణభట్టు చేసిన సహాయము భావితరముల వారికి దెలియకపోవునను ఆలోచనలో పై పద్యమును వ్రాసి అందు చేర్చియుంటారని చెప్పవచ్చును. ఇట్లగుటలో అసహజమేమియు లేదు. ఇట్లు చేర్చుట నన్నయ, నారాయణభట్టులు మరణించిన సమీప కాలమందే జరిగియుంటుంది. ఇట్టి పద్యము నారాయణభట్టు వద్దనుండిన ప్రతిలో ప్రక్షిప్తమై యుండును. ఆవల నన్నయభట్టు యింటనుండిన ప్రతిని జూచి వ్రాసికొన్న వారి ప్రతులలో నీ పద్యము లేకయుండుట, నారాయణభట్టు యింటనుండిన ప్రతిని జూచి వ్రాసుకొన్న వారి ప్రతులతో నుండుట తటస్థించినదని చెప్పవచ్చును.

అప్పకవికి దొరికిన ప్రతిలో నీ పద్యముండినందున కాబోలు ఆతడీ పద్యమును నిత్య సమాస యతికి లక్ష్యముగా నిచ్చియుండుట తటస్థించెను. నిడుదవోలువారు అప్పకవిని గురించి "అప్పకవి పై పద్యమును నిత్య సమాస యతికి లక్ష్యముగా నిచ్చి నన్నయయే రచించినట్లు తోపింపజేయుటకు మెలకువతో "నిర్వహింపగన్" అను అసమాపక క్రియతో రచించి చేర్చినాడు. దానితో నది నన్నయ భారతమున నతుకుకొన్నది." అని భావించినారు. నన్నయయే రచించినట్లు తోపింపజేయుటకు మెలకువతో "నిర్వహింపగన్" అను అసమాపక క్రియతో రచించి చేర్చినవాడు నారాయణభట్టుకు సంబంధించినవాడే కాని, అప్పకవి కాదు. అట్లు చేర్చినవారి ఆశయము వేఱుగా యుంటుంది. భారత రచనకు నారాయణభట్టు పెక్కు సంవత్సరములు నన్నయగారికెంతో తోడ్పడెను. కాని, ఆ విషయము భారతమున నెక్కడా చెప్పబడలేదు. తుదకు సూచింపబడనూ లేదు. ఆతని సహాయము భావి తరముల వారికి తెలియకపోవును గదా యను ఆలోచనతో వారాపద్యమును వ్రాసి చక్కగా యాలోచించి, యించుమించు తగినచోటనే చేర్చినారు. కాని, వారే దురుద్దేశముతోనూ నిట్లు చేసిరని చెప్పుటకు సాధ్యము గాదు.

తెనుగు భాషను సంస్కరించి ప్రథమారాధ్యుడైనవాడును, ఆంధ్రుల యావన్మహోదయమునకు స్థాపకాచార్యుడైనవాడును, ఆంధ్రజాతికి సతతము ప్రాతఃస్మరణీయుడైనవాడును నగు నన్నయ తాను "విపుల శబ్దశాసనుడే" యయ్యును, నానా రుచిరార్థ సూక్తినిధి యయ్యును "దుర్గ మార్గ జల గౌరవ భారత భారతీ సముద్రము"ను దటియుట కష్టము గనుక, తాను చేపట్టిన మహా కార్యము జయప్రదముగ ముగియుటకై నారాయణభట్టు యొక్క తోడ్పాటు నుపయోగించుకొనెనని నన్నయ భారతము నందుండు "పాయక పాకశాసనికి" యను పద్యమునుండి తెలియుచున్నది.

నారాయణభట్టు వాఙ్మయ ధురంధరుండు అగుటయే కాదు తనకు సహాధ్యాయుడు. సహాధ్యాయుడే కాక తనకు ఇష్టుడు. ఇష్టుడేకాక యభిమత స్థితి గలిగియున్నవాడు. నారాయణభట్టు యిన్ని సుగుణములు గలిగియుండినవాడైనందున, లోకజ్ఞుడైన నన్నయ తనకు తోడుగా నాతనిని నిశ్చయించుకొనెను పై పద్యములో నన్నయగారికిని, నారాయణభట్టునకును మధ్యనుండిన మూడు విధములగు సంబంధములు చెప్పబడియున్నది. వారి మధ్యనుండిన యీ సంబంధములు వారిరువురికి దక్క రాజమహేంద్రవరములో నుండిన వారెవరికీ దెలియవు. నన్నయ బాల్యమునందు రాజమహేంద్రవరమునకు గడు దూరమున నుండిన ప్రాంతములో విద్య నభ్యసించెను. తర్వాత పెక్కేండ్లకా రాజధాని నగరమును జేరెను. ఒకవేళ వారిరువురు సహాధ్యాయులని గొందరికి తెలిసియున్నను వారిమధ్య మంచి మైత్రియుండెనని దెలియదు. ఎందరో బాల్యమందొక పాఠశాలయందు, ఒకే తరగతియందు, ఒకే గురువునొద్ద జదువుట నిజము కాని, వారిలో నందరిమధ్య నన్మైత్రి స్థిరపడుట కష్టము. కావున, యీ విషయము వారు తప్ప తక్కినవారికి దెలియదు. అందువలన పై పద్యమును నన్నయభట్టే వ్రాసి, తనకు తోడ్పడిన మిత్రునిపట్ల తన కృతజ్ఞతను నిట్లు దెలియజేసి యుండవచ్చును. అందువలన నా పద్యమును నన్నయయే వ్రాసెనని తేలుచున్నది.

# అంతరాత్మ నవ్వుకుంటోంది...

## డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు

*సంవత్సరాది సంబరమంతా
రాఘవేంద్రుని బృందావనం చుట్టూ
తిరుగాడుతుంటే
డోలాయమానంగా మనస్సెందుకో జోగాడుతోంది!

చెమటలు నిండి పమిటలు తొలగి
పంకా రెక్కల వేడిగాలుల ఊరడిల్లుతూ
హడావుడిగా
భక్తజనం చేస్తున్న హంగమా చూస్తోంటే నవ్వు వస్తోంది!

అగరు వత్తులు వెలిగించి
అరటిపండుకు గుచ్చడమెందుకో!
సాంబ్రాణి పొగలు బాగా దట్టించి
అన్ని పటాల ముందరా త్రిప్పడమెందుకో!

దేవుడి చుట్టూ
గిరగిరా తిరిగిన కొబ్బరికాయ తల బ్రద్దలు కొట్టి
దాని గుండె నీళ్లు తీర్థమనడమెందుకో!
తులసి నందులో కలిపి పరమ పవిత్రం చేయడమెందుకో!

కర్పూరం ఉందని
జిగేలుమనే హారతి పళ్లెరంలో నిలువునా తగలబెట్టి
ఆ ధగద్ధగల కళ్లకద్దుకోవడమెందుకో!
విద్యుల్లతలా మెరిసే మూలవిరాట్టును చూచి తృప్తిపడడ
మెందుకో!

కుంకుమపూజ
పంచామృతాభిషేకం
అర్చన
సేవ
రకరకాలు!
కానుకలు
ముడుపులు
దోపిళ్లు
మ్రొక్కుబళ్లు
అనేకానేకాలు!

భజన గీతాలు
గోవింద నృత్యాలు
ఎన్నని!
ఎన్నెన్నని!
ఇవన్నీ ఆచారాలా?
ఎవరు ఎప్పుడు కనిపెట్టినవి?
ఇవన్నీ మనిషి నిర్దేశించిందే కదా?
ఇవే సరైనవని ఎందుకనుకోవాలి?

అయితే,
ప్రతిచోటా ఇదే తంతు!
[ప్రపంచం ఎంత పెద్దదో
మనవాళ్లు ఆలోచించరా?]
అంతే అంతే,
ప్రతి గుడిముందూ ఇదే ధోరణి!
[మొత్తం జనాభాలో
సనాతన ధార్మికులు ఏమాత్రం?]

కాని ఒకటి మాత్రం నిజం
తెలుసుకోవలసిన పచ్చి నిజం
ఇక్కడ భారతీయులు
ఇంకోచోట ముస్లిములు
మరెక్కడో కిరస్తానీయులు
ఇంకెక్కడో జైనులు

బౌద్ధులు
యూదులు
పారశీకులు
నానారకాల మనుషులు

ఎందరో ఎందరెందరో!
ఎవరి ఆచారాలు వారివి!

మానవ భాగ్యోదయం కోసం
మానవజాతి వికాసం కోసం
ఎవరి పద్ధతులు వారివి
ఎవరి దారులు వారివి

అయితే అందరి భావం ఒకటే!
అభిలషిస్తున్న లక్ష్యం కూడ ఒకటే!

ఆ భావాన్నే పరమాత్మ తత్త్వంగా
ఆ లక్ష్యాన్నే పరమాదర్శంగా
తీసుకొని సాగిపోయేవారు మనీషులు, మహర్షులు!
వారికి మతం లేదు, జాతి లేదు, ఏ రకమైన పట్టింపూ లేదు!

వారి నివాసం సమస్త విశ్వం
వారి విశ్వాసం అనంతానంతం

అది తెలిసిన వారి గొప్పతనం!
ఏనాటికీ తెలిసిరాని మహాశక్తి పనితనం!

నిజమో కాదో
తప్పో ఒప్పో
ఆలోచిస్తున్న నాకు
చేతుల్లో కొబ్బరిచిప్ప పడ్డది
దానినిండా పూలు, మంత్రాక్షితలు!

తేరుకోకముందే
ఇంకా తెమలకముందే

రెండు నెత్తిమీద చల్లుకోవాలట
పూవు చెవిలో పెట్టుకోవాలట
నా భార్య అదేపనిగా ఆదేశిస్తోంది!

అలాగే చేసాను....
అప్రయత్నంగా అంతరాత్మ నవ్వుకుంటోంది... *

# చౌడప్పవర్య!

రాజితోపాయుండు, రహిని కుందవరపు
రాయుండనంగ పేర్వడసి మిగిలి
కవులయందున హాస్య కవిజాణ, గాన వి
ద్యా ప్రవీణుడనంగ, యశమునంది
సోమయాజి పిదప, చూడ కందములకు
యీతడే ఘనుడని యెన్నిక పడి
నీతులు పది మరి బూతులు పది సభన్
గడగి జెప్పినవాడె, కవి యటంచు
బూతు పలుకక నవ్వేటు బుట్టునన్న
ధైర్యశాలివి చౌడప్పవర్య నీవు
దేశభాషను లెస్సగు, తెలుగుభాష
కమర సౌందర్య మొసగిన యాంధ్ర సుకవి.

# వేమనార్య!

అమర లోకమునకు అప్సరోగము లట్లు
ఇల కాటువెలదుల నిచ్చినావు.
తాకి గాలికి పోవు తాలు మాటలకెల్ల
తూర్పెత్తిపోయుట నేర్పినావు
కత్తికే పూసిన గాయపు మందట్లు
పాలంభమున నీతి పరపినావు
నవ్వులాటకు గాక, నవ్వులాటను నీవు
నీతి రక్షణకునై నిలిపినావు
మెత్తనగు హాస్యమందున కత్తి పదును
వెలయజేసిన ఘనయోగి వేమనార్య
దేశభాషను లెస్సగు, తెలుగుభాష
కమర సౌందర్య మొసగిన యాంధ్ర సుకవి!

**శ్రీ కపిలవాయి లింగమూర్తి**

# చిత్రవధ!

## శ్రీ ఏలూర్చారి విజయం రాఘవరావు

డబ్బున్నవాళ్ళ పిల్ల.

చీకూ చింతా ఎరగని చిన్నప్పట్నుంచీ మితిలేని గారాబం, పరిమితి లేని స్వేచ్ఛలతో పెరుగుతూ, కళ్ళెం లేని గుర్రంలా కాలంతో చిందులాడుతూ, ప్రతిచోటా ప్రణయ సల్లాపాలతో 'గుస' 'గుస'లాడే యౌవ్వనపు రోజుల్లో, కళంటే చెవి గోసుకునే పరివర్త నొచ్చిందెందుకో హటాత్తుగా!

ఆమే కమల....

నోరు తెరిస్తే కవిత్వం పొంగినట్టే, గీత గీస్తే చాలు- అందాలుట్టిపడే వర్ణచిత్రమై కూర్చుంటుందీ అబ్బాయి కుంచె మహిమేమిటో మరి!

అతనే రవి....

ఆ తర్వాతేం జరిగిందో 'పేద్ద' కథకుణ్ణడగఖ్ఖర్లా. పసి పిల్లల్నడిగినా చెప్తారు.

కమల రవిని ప్రేమిస్తుంది. పెద్దవాళ్ళ కిష్టం లేకపోయినా పెళ్ళి జరిగి తీరుతుంది. ప్రణయలీలల్లో నాలుగు రోజులు స్వర్గంలా గడిచిపోతాయి. తర్వాత జీవిత సమస్య లొకటొకటే బైటపడి కళ కతీతమైన కఠోర ఘట్టాలు ఘటిస్తాయి నిత్య జీవితంలో. బ్రతుకు లోతుపాతులకు భయపడ్డ భీరువులు కష్టాల సమస్యా పూరణానికి మరణమే అంతిమ సాధనమని భ్రమిస్తూ, మందు తినో, గంగలో దూకో, రైలుకింద పడో - వినరాని విపత్తులకు పాలై - లోకంనుంచి పారిపోతారు శాశ్వతంగా. పోతూ పోతూ బ్రతికున్నవాళ్ళ జీవితాల్లో ఘోరమైన నిశ్శబ్దాన్ని గుప్పించి మరీ పోతారు!

అల్లాగే జరిగింది పాపం!

కమల పోయింది!

రవి బ్రతికుండీ కూడా జీవన్మరణాన్ననుభవిస్తున్నాడు! పశ్చాత్తాపంతో పరితప్తుడై, మైనంలా కరిగిపోతున్నాడు ప్రతి క్షణం!

తప్పు తనదే. ఒప్పుకుని తీరాలి...

కళాసృష్టిలో మునిగి తానై వలచి వచ్చిన అర్ధాంగినికి, ఇరవై నాలుగు గంటల్లో కనీసం కొన్ని ఘడియలైనా - ఆమె సంతోషం కోసం - వెచ్చించలేకపోయ్యాడు రానూ రానూ! అను కున్నదొకటీ - అయిందొకటీ! శ్రీమంతుల కుటుంబంలోంచి, చిరాకు నరకంలోకి స్వయం దూకి తన్నుతాను శృంఖలాబద్ధం చేసుకున్నట్టు ఘటనతో కుంగి కృశించి, లోకం గాఢనిద్రలో వున్న ఒక అర్థరాత్రి, లోకంతోనే తెగతెంపులు చేసుకుంది కమల....

* * *

భార్య చనిపోయిన తర్వాత, అతనికి స్వంత వూళ్ళో కాలు కదపడాని కిష్టం లేకపోయినా, వున్న వూరు వదలడానికి మనస్కరించలేదు, మరో వూళ్ళో సరికొత్త జీవితానికి 'ఓ' 'నా' 'మా' లు దిద్దడానికి ధైర్యం చాలక....

కమలను గురించి అల్లిన కల్పనా కథలన్నీ మరిచినట్టు శాంతిని పొందాడామె ఆఖరు క్షణాల్లో. కానీ - తనదిగా చలామణీ అవుతున్న పదార్థమేదో తనకు దూర దూరంగా తొలిగిపోతూ, శూన్యంలో అంతర్లీనమౌతున్నట్టు పీడకలలు కంటూ భయపడడం పరిపాటీ అయిపోయిందీమధ్య. పేము బెత్తాలతో తమ చేతిని తామే చిరుదెబ్బలు చరుచుకుంటూ తీవిగా పోతున్న సోల్జర్లను చూసీ చూడనట్టు సాయంత్రం రోడ్డుపక్కన నడుస్తుంటే, వారి జీవితాల్లోని సూటీతనమైనా తన కబ్బలేదేమో అన్న సందేహం మాటిమాటికీ స్ఫురించేది! చివరిసారిగా చిత్రం గీసి, అన్ని బొమ్మలకూ 'వాఖ ఇది'గా చిచ్చుపెట్టి, తనూ శాంతంగా మరో లోకంలోకి మరుగుపడిపోదామనుకుంటాడు అప్పుడప్పుడూ.... అసలు "తన చిత్రాలెవరిని ఉద్ధరించడానికో?" అని మాత్రం తనెప్పుడూ ఆలోచించని విషయం....

గది ఊడ్చి మూడు దినాలైంది. దహన సంస్కారాల తర్వాత తంతు కోసం వొచ్చిన బ్రాహ్మలను "వొద్దు"ని పంపించేశాడు. సంక్రాంతి చలి వొణుకొస్తున్నా, తన చిత్రాలకు మట్టికద్దం కప్పిన పాత కంబళీ తను కప్పుకోడు! కమల లేని

కొంపలో - పరదా మూలగా - మసి పూసుకున్న దీపపు సెమ్మెను తుడిచి వొత్తి వెలిగించడానికైనా బద్ధకం వేస్తుందిప్పుడు! వీధి లాంతరు దగ్గర చదువుకుంటూ ఒక రాత్రంతా గడిచిపోయింది. మరో రాత్రి సాయంత్రం అయిదింటికే నిద్రపోయాడు! పోతే- ఓ రాత్రి ఇంటికే రాలేదు! ఇదీ, జీవితపు వాలకం...

తల్లినీ, తండ్రినీ, చెల్లాయినీ చూస్తూ చూస్తూ 'నావి' అని చెప్పుకోదగ్గ నాలుగు గోడల మధ్య గడిపిన జీవితాన్ని మరిచే, దాదాపు పది సంవత్సరాల పైబడింది. ఇల్లు విడిచిందెప్పుడో, ఎల్లాగో, అసలు జ్ఞాపకం చేసుకోదల్చుకోడెప్పుడూ.

కమలతో తొలి పరిచయం రోజున, ఇప్పుడు తనుంటున్న గది గోడమీద గీసిన 'ఉషాకన్య' బొమ్మలో స్ఫుద్దుగా పొదిగిన తన పేరు చూచుకుని, పెద్దమనుషులో, పేరున్న కళారాధకుల్తో తనకోసం వస్తారని తనకు ఆశ లేదు. వీధి చివరి బడిలోంచి వొఖ పసివాడైనా "మామయ్యా! నా బొమ్మ గియ్యవూ?.... మావా! ఇవ్వాళ నేనూ, రోహిణీ, ఇద్దరం కూచుంటాం.... కలిపి వెయ్యాలేం" అంటూ తనకోసం వస్తే, అదే తన జీవితాశయంలా- వొయ్యారంగా, ఫలవృక్షంలా - నేలకొరుగుతూ కుంచె అందుకుంటాడు! బడిలో చదివే పిల్లలందరి బంధువులూ రవికి పరిచితులే. ఒకటో అరో, ప్రతి యింట్లో తన చిత్రం వుంటుంది. అమ్మినవి కావు.... పిల్లలకు పంచిపెట్టినవి."

వీధి మలుపులో జమీందారుగారి కట్టడం చుక్కల్ని లెక్క పెడుతున్నది. "నా చిత్రం, నా పేరూ ఆ కట్టడంలో హంస తూలికా తల్పాల సహవాసం చేస్తున్నాయి. మరి నేనెక్కడ తలదాచుకున్నా జీవితం నడవదా యేవిటి?" తరచు తన్ను తాను ప్రశ్నించుకుంటాడతను. కొన్నాళ్ళు సుఖనిద్రకదే కారణం. కానీ - జంతువులు నివసించ నిరాకరించే గృహ పరిసరాల్లో భవ్య సౌందర్యాన్ని భావించుకుంటూ చిత్రాలు గీస్తూ, చిత్ర విచిత్రంగా జీవిత నౌకను ఒడ్డు దాటిస్తున్నాడంటే ఆశ్చర్యమే!

ఖచ్చితంగా చెప్పాలంటే, జమీందారుగారి ముద్దు మనవడి శిష్యత్వం అక్కరకొచ్చిందన్న మాట. కృష్ణదాసుగారి పుణ్యమా అంటూ, వెళ్ళినప్పుడల్లా 'భోజనం పెట్టమని' వంటవాళ్ళను పుర్మాయించారు. "ఎప్పుడూ ఇక్కడికే వస్తున్నా"డని, వంట వాళ్ళు జమీందారుగారితో చెప్పినట్టు లేదు. ఇది కారణంగా రవికి భోజనం గొడవ లేదనలేం. రాత్రి వంటవాడు రొట్టెలో కూర వేస్తుంటే 'ఫెళ్ళు'న మెదడులో ఒక గడ్డుప్రశ్న గుచ్చుకొస్తుంది. "ఇవ్వాళ అమ్మా, నాన్నా, యీ కూరకు నోచుకున్నారో లేదో!"—

అరిటిపండును పాయసంతో నంజుకుంటూ అనాలని పిస్తుంది "పాపం! ఇది కమలకు మహా యిష్టం!"

వంటింట్లోంచి చేతులు కడుక్కుని వీధిలోకి వచ్చినా, ఆనాటి వంటకాలన్నీ, నిజజీవితంలోని అభావాల నేదో ఒక రకంగా గుచ్చి గుచ్చి గుర్తుకు తెస్తాయి! కొన్నాళ్ళుగా దీని అర్థం ఊహించుకోడం అసంభవమౌతోందతనికి!

భోంచేశాక కొంప చేరుకుని గది తాళం తీస్తున్నాడు. గొళ్ళెపు సందులో కనపడిందో కాయితం ముక్క. తీసి, చదువుదామనుకుంటూనే, సిగరెట్ పీక ముట్టిస్తూ, పరధ్యానంగా ఆ కాయితం ముక్కను జేబులోకి తోసేశాడు!

ఆనాడు పసివాళ్ళు నేర్చుకుంటూ గీసిన చిత్రాలు దిద్దుతూ దిద్దుతూనే నిద్రొచ్చేసింది. రాత్రి కమల కలలో వచ్చినట్టు స్ఫురించినా, అద్దంలాంటి ఆమె వర్చస్సును, కలగా తోసిపుచ్చడానికి మనసొప్పలేదు. రెపరెప లాడుతున్న కనురెప్పలు రుద్దుకుంటూ, సిగరెట్ పెట్టె వెతుకుతూ, మరో అరుణోదయం ప్రారంభమైంది తొమ్మిది గంటలైనా మిట్ట మధ్యాహ్నంలా మండుతోంది బైట.

మనసుకు తగ్గ మంధనలే యీ కాలం తీరు! ఎక్కడ చూసినా క్రౌర్యం!

పోలీసుల కాల్పుల సద్దడి!! పక్క వీథిలోనే! పట్టపగలే!

ఇది నిత్యకృత్యాల్లో ఒక అంగంలా తయారైంది గనక "రోజూ చచ్చేవాళ్ళకు యేడ్చేవాళ్ళెవ" రన్నట్టు, రవికీ అలజడంతా అలవాటే!

తుపాకీ దెబ్బలకు వొణుకుతూ, ఇంట్లో, బూజు పట్టున్న కమల పటం "ధభీ"మని పడి ముక్కలు ముక్కలైంది!!

మెల మెల్లగా కారుతున్నై కన్నీటి బొట్లు... సన్నగా కదిలినై రవి పెదిమలు "దీపం ఆరిపోతుందా ఎప్పుడైనా.... రెపరెపలాడీ ఆడీ అనంత తేజస్సులో కలిసిపోతుందంటే...."

*　　　*　　　*

"రవీ మామా.... తాతయ్యొళ్ళారిప్పుడే.... భోంచేద్దాం రాండి" పరిగెత్తబోయే, జమీందారుగారి మనవణ్ణి, పరాకుగా

చూస్తూ గొణిగాడు రవి "అరే! ముఖమైనా కడగలేదే! మళ్ళీ భోజనం!"

కాలకృత్యాలు తప్ప, ముగించదగ్గ పనులేమీ కనిపించవు రవికి కొన్నాళ్ళు! మ్రగ్గిపోవడం విధి - పొద్దు గడవదు గనక! బడి సెలవుల్లో పిల్లలు గూడా రావడం అరుదు. ఆటల్లో మునిగి పోతారు వాళ్ళ వాళ్ళిండ్లల్లో. అసలు తన శిష్యబృందం ఎవరెవరి తాలూకు పిల్లలో కూడా తెలీని, కాలానికి లొంగిన అమాయకుడు రవి!

అన్నట్టు - ఆనాడాదివారమైనా రామూ, రోహిణీలు మరీ మరీ చెప్పిపోయారు 'వస్తామని'. వాళ్ళ చిత్రం పూర్తయినా 'మౌంట్' కొనడానికి జేబులో 'పైసా' కూడా లేదివ్వాళ! ఏం చెయ్యడం!?

ఫోంచేస్తూ పంబవాడ్నడిగాడు "నర్సింహులూ! కృష్ణ బాబుగారెప్పుడైనా అవసరం వస్తే మీకు అదనపు డబ్బులిస్తారా?"

"హు!! వడ్డీతో సహా జీతంలో మినహాయించుకున్నారు మొన్న మా అక్క పెళ్ళికి తీసుకున్న అప్పుకింద! పై మాటలే బాబూ! ఏమో మీరడిగితే చెప్పలేం ఆయన ముద్దుమనవడి గురువుగారు గదండీ మీరు!

డబ్బు విషయంలో "రవైనా, నర్సింహులైనా జమీందారు గారికేమాత్రం భేదం లేదన్న" నిర్ణయం తనది. గొడ్డులా ఇంట్లో రాపవళ్ళు వండి పెడ్తున్నందుకు నిజానికి నర్సింహులుకే ఎక్కువ ఆదరణ చూపవచ్చేమో!

"ఛీ.... ఏం అడక్కపోతే...."

స్ఫురించిన భావాలకూతంగా సిగరెట్ ముక్క వెతుక్కుంటూ చెయ్యి జేబులో కెళ్ళింది. "కరెన్సీ"లా నునుపుగా తట్టిన కాయితం ముక్క ఆధాటుగా తీశాడు.

"రవీ! నమస్తే. మీకోసం వచ్చా. మీరు రాలేదింకా. మీరు మా చెల్లికీ, తమ్ముడికీ ఇచ్చిన చిత్రాలు చూశా. మురిసి పోయానంటే నమ్మండి. నేర్చుకోవాలని వుంది. మళ్ళీ వచ్చి మాట్లాడతాను. క్షమించి, రేపు ఇంట్లో వుంటారు కదూ!

సెలవు. శాంత"

గొళ్ళెంలో దొరికిన కాయితం ముక్క! చదవడానికిప్పుడు తీరిక దొరికింది! - (దొంగలుబడ్డ వారం రోజులకు కుక్కలు మొరిగినట్టు!) మాచక్కని లెటర్ హెడ్! క్షీరసాగరంగారి కుమార్తె కాబోలు. రాచవాళ్ళమ్మాయి. ఏమైనా విచిత్రమైన జీవితమే తనది. కానీ జేబులో లేకపోయినా కలవాళ్ళతోనే స్నేహితం చీటికీ మాటికీ!

దూరంగా దిష్టిబొమ్మలా కూలబడ్డ తన గదివైపు చూపులు మళ్ళించాడు. ఎవ్వరూ ఎదురు చూస్తున్నట్టు లేదు.

"ఆమె ఇవ్వాళ రాదేమోలే!"

గొళ్ళెం తీస్తుంటే మరో కాయితం ముక్క విరాజమాన మైంది! ఏమిటీ టెక్నిక్!!

"ఎక్కడికి కెళ్ళారో తెలీదు. మళ్ళీ ఆలస్యమైంది. ఆలయానికి పోను కారు వచ్చింది. ఇప్పుడే వెళ్ళి తీరాలి. కనీసం రేపన్నా ఇదే సమయానికి శ్రమనుకోకుండా ఇంట్లో వుండండి.

నమస్తే. శాంత"

గొళ్ళెం కబుర్లు నెమరువేసుకుంటూ తలుపు తీస్తున్నాడు!

"రవీ మామా! మేం వచ్చేశాం"

వెనక్కు తిరిగాడు రవి. ఇమిడీ ఇమడని బొత్తాలతో కొత్త సూటూ గౌనూ తొడుక్కుని హాజరయ్యారు. రామూ, రోహిణీ. "ఇస్తా"నన్న చిత్రం తీసుకుపోతే "వస్తున్నా"మని ముందే చెప్పించారు గనక.

రోహిణిని ముద్దు పెట్టుకుంటూ అన్నాడు రామూతో "బజార్లో మౌంట్లన్నీ అయిపోయాయ్రా. మీ చిత్రం రెడీ. అనక మళ్ళీ వెళ్ళి మౌంట్ కొని, ఫ్రేమ్ పూర్తిచేసి ఎంచక్కా మీ యింట్లో స్వయం నే యిచ్చిపోతా. కోప్పడకండేం!"

"ఊహూ!!"

ఏకగ్రీవంగా నిరాకరించారు రామూ, రోహిణీ.

"ఇదుగో మా అక్కయ్యిచ్చిన రూపాయ్ నోటు. ఇప్పుడే కొనుక్కుందాం పదండీ.... అదెక్కడ దొరుకుతయ్యో మాకు తెలుసు కూడా...."

పసివాళ్ళ చెవులు గిల్లుతూ "సరే పదండం"టూ బయల్దేర బోతున్నాడు రవి.

ఇంతలో వెనకనుంచి శబ్దం "రామూ! రోహిణీ! ఎప్పుడూ అదే పనా? సగం కాలం మీవల్లనే వృధా అవుతున్నట్టుంది వారికి పొండి. అమ్మ ఆపిల్చు కొన్నది మీకోసం."

సొంత కారు శబ్దం కొత్తగాకపోయినా బెదురుగా వెనక్కు తిరిగి చూశారు పిల్లలిద్దరూ. సిగరెట్టు ముక్క వెలిగించబోయే

అగ్గిపుల్లను దాచేస్తూ గుమ్మం దగ్గరగా నుంచున్నాడు రవి. తన పాత కొంపలో విరిగిన కిటికీల గాజు ముక్కల్ని ముద్దుబెట్టు కుంటున్నట్టు మరీ దగ్గరగా నుంచున్న కారులోని వెనక సీట్ లోకి రామూ, రోహిణీ గంతు వేశారు "నారాయణా! కార్ పోనీ. అక్కయ్య కోసం మళ్ళీ వద్దువుగానిలే"

కారు కదిలించాడు డ్రైవర్ నారాయణ. సగం దూరం పోయాక అడిగింది రోహిణి "అక్కయ్యెందుకొచ్చిందీ? మమ్మల్ని వెతకడానికా?

"కాదమ్మా. చిత్రాలు గియ్యడం నేర్చుకోడానికి"

* * *

"చూడండీ! నేను చిత్రలేఖనం నేర్చుకోడానికొచ్చాను"

"అల్లాగే"

"మరి పరీక్షిస్తారా?"

"అల్లాగే"

"బయట మీ "ఉషాకన్య" చిత్రాన్ని కాపీ చెయ్య మన్నారా?"

"ఊఁ"

శాంతకీ అర్ధాక్షరాల జవాబులు నచ్చలేదు. 'కొత్త' కావడం వల్లనేమోనని సమర్థించుకుని గీస్తోంది చిత్రాన్ని.

"పాపం! కమల పోయిందిట కదూ! విన్నాను. మొన్న భాష్యంగారన్నాడు"

"ఊఁ"

వింటూన్నప్పుడు, ఏ ఆలోచనలో వున్నాడో ఆమె గ్రహించలేకపోయినా, భాష్యం పేరు వినగానే రవి మూతి ముడుచు కున్నట్టు స్ఫుటమైందామెకు. అతను కమలకు తమ్ముడుగా జన్మించినందుకు రవి ఎన్నిమాట్లో చింతించిన మాట నిజం.

అందచందాలతో, శ్రీమంతుల కుటుంబంలో పుట్టినా, అనుకోకుండా తనలాంటి బీద చిత్రకారుణ్ణి అందల మెక్కించి నట్టు, తన జీవితంలోకి రావడాన్ని "యవ్వనాంధకారంతో, చేసిన తిక్కపనిలా" లోకమెంత ఆడిపోసుకున్నా - పాపం! ఆశ్చర్య జనకమైన సౌశీల్య ప్రవర్తన కమలది! అలాంటి కమలకు, భాష్యం, "తమ్ముడం"టే నమ్మలేం! డబ్బూ, హోదా చూసి లోకులెంత పొగడినా భాష్యంలాంటి గోముఖ వ్యాఘ్రాలను దరిజేర నివ్వడు రవి. కారణం, అభిరుచులు భేదించడం మాత్రమే కాదు; అసత్య జీవనాన్ని అసహ్యించుకోవడమే ...

* * *

మళ్ళీ అడిగింది శాంత

"వింటున్నారా? మీ "ఉషాకన్య" చిత్రాన్ని కాపీ చేస్తున్నా ...."

పరధ్యానంగా అన్నాడు రవి.

"ఊఁ ... చెయ్యండి చూద్దాం...."

పూర్తిచేసింది చిత్రాన్ని, విచిత్రంగా శాంత! చుక్క కూడా పొల్లుపోలేదు!

"నిజానికి, మూలంకన్నా ఇదే బాగుందేమో!" లోలోపల ఆమె సామర్థ్యాన్ని శ్లాఘిస్తూ, తొణకకుండా అనుకున్నాడు రవి....

"రోజూ నేర్చుకోడాని కొస్తారుగదూ?"

మురిసిపోయింది శాంత. "అల్లాగే. అభ్యంతరం లేకపోతే...."

".... .... ...."

"మరి సెలవా?"

"ఊఁ"

గుమ్మం దాటి కిటికీవైపు ఓరచూపు చూస్తూ, మళ్ళీ పలక రించింది శాంత "రామూ, రోహిణీవాళ్ళ మౌంట్సు నేనిప్పుడు కొని తీసుకురానా?"

"తొందరేంటి. రేపు చూద్దాంలేండి"

"...చిత్రలేఖనానికి........ నెల కెంతివ్వాలో తేలిస్తే బావుంటుంది"

"మౌంట్లకు సరిపడ ఇస్తే చాలు"

కారు తలుపు తెరుస్తూ ఫక్కున నవ్వింది శాంత.... "భావకవి!"

* * *

"నారాయణా! నాకోసం ఎవరైనా వచ్చారా మవింటికి?"

"భాష్యంగారమ్మా. రోహిణమ్మగారితో మళ్ళీ వస్తానని చెప్పినట్టుందమ్మా"

"సరే. పద త్వరగా"

# చర్మవ్యాధులకు




## అతి గాఢంగా పనిచేసే
## అమృతాంజన్ డెర్మల్ ఆయింట్‌మెం

చర్మవ్యాధులకు ఉపయోగపడే సాధారణ ఆయింట్‌మెంట్లు ఎక్కువగా చర్మం లోపలకు ప్రవేశించలేవు కాని అమోఘమైన చర్మరోగ నివారణ ఔషధాలు విశిష్టంగా చేరిఉండడంచేత అమృతాంజన్ డెర్మల్ అయింట్‌మెంటు మాత్రము లోపలకు ప్రవేశిస్తుంది. సాధారణ చర్మవ్యాధులను అతి శీఘ్రంగా నిర్మూలించి చర్మాన్ని పూర్వస్థితికి తెచ్చి సహజంగాను ఆరోగ్యవంతంగాను ఉంచుతుంది. అమృతాంజన్-డెర్మల్ అయింట్‌మెంట్ తామర, గజ్జి, దురద ఇతర చర్మ రోగాలకు ఆదర్శమైన నివారిణి. నేడే కొనండి।

**అమృతాంజన్ లిమిటెడ్ 42-45, లజ్ చర్చ్ రోడ్డు, మద్రాసు 600 004**

**Amrutanjan Limited** 



757-TG

వేగంగా కదులుతున్న కారు చక్రాల నురుపిడికి రేగిన దుమ్ము పొరలు పొరలుగా పక్కనే సాగిపోతోంది. దొంగనిద్ర పోతూ మెల్లమెల్లగా ప్రపంచాన్ని మింగుతున్న కాలం కంట్లో పీడకలల్లా ఎక్కడెక్కడో జరుగుతున్న హత్యలూ, మానభంగాలూ నిరసిస్తూ కాబోలు - గుట్టలు గుట్టలుగా సుడిగాలికి ఎండుటాకులు రాలుతున్నై. దరిద్రుడి నుదుటి రేఖల్లో చెదిరిన కురుల్లా, పోలీసు కాల్పుల రక్తం మరకలింకా 'ఖిక్కు' 'ఖిక్కు' మంటున్నాయా రోడ్డుమీద.

దూరంగా వీధి మలుపులో వెనక్కు తిరిగి చూసింది శాంత, కారు అద్దంలోంచి పరాకుగా. శిలా ప్రతిమలా నుంచునే వున్నాడింకా రవి!

కృష్ణాంబుద ఛాయల్లో 'ధళుక్కు'న విద్యుల్లతలు వెలగడం సృష్టి వైచిత్ర్యమే. కాంక్షాకాంతులు స్పృశించని జీవితాలకు, రెప్పపాటులో నవ్యజ్యోతులను చూడగలిగే ఆశ పొటమరించడం అనూహ్యమేమో! కానీ నివురుగప్పిన నిప్పులో ఉష్ణత సాంతం పుడిగిపోయిందనలేం.

మట్టి మసకపొరలను చీల్చుతూ పరిగెత్తిన కారువైపు చూస్తూనే నుంచున్న రవి నివ్వెరపోతూ అనుకుంటున్నాడు-

"కళామూర్తి ఆమె!!"

* * *

శాంత ఇల్లు చేరుకున్న కాసేపట్లో భాష్యంగారొచ్చారు. తన మేనమామకు దూరబంధువనో, బాగా డబ్బున్నవాడనో, కాస్త గౌరవంగా చూస్తారతన్ని శాంత యింట్లో. అయితే— అతన్నర్థం చేసుకున్న ప్రత్యణువూ అతని దరిజేరడానికి నిరాకరిస్తుంది! అర్థం చేసుకోనివ్వడమే అరుదు! అదే అతని చాకచక్యం! వేపాకుకు చక్కెర పులిమి అందించగల విధానాలెన్నో తెలుసతనికి!

అడిగిందామె "బాబూ! మీ ఎగ్జిబిషన్ మాటేవిటి?"

"దాన్ని గురించి మాట్లాడ్డానికే వచ్చా. వచ్చే మాసానికి సిద్ధమౌతుంది. పట్నం వెళ్ళి అనేకుల ఆర్థిక సహాయం లాక్కొచ్చా. మరి నీ చిత్రాలు తయారా శాంతా?"

"అడిగారు గనక చెబుతున్నా. రవి గీస్తున్న అద్భుత శైలి ముందర, నా చిత్రాలు దిష్టిబొమ్మల్లా కనిపిస్తున్నయ్ నాకు! నే నేర్చుకోడం మళ్ళీ 'ఏ' 'బి' 'సి' దగ్గర్నుంచీ మొదలెట్టానంటే నమ్ముతారా? - అదిసరే రవిగార్ని చిత్రాలిమ్మని అడిగారా?"

ఒక్కసారి భాష్యంగారి ముఖకవళికలు మారిపోయాయెందుకో! "హూ!! అంత లోటుగా కనిపిస్తే నేనే గీస్తాను. అతణ్ణడగడం అసంభవం...."

ఎటో యెటో పోతున్న భ్రమరాలు పరిమితిలేని పరిధుల్లో వెతుక్కుంటూ దూరదూరపు గులాబీల నాశ్రయించి ఆఘ్రాణిస్తాయి అనతిదూరంలో కుప్పిగంతులు వేస్తున్న కూపస్థమండూకాని కవగతమే కాదా సువాసన! రవిలాంటి ఉత్తమ కళాబ్రహ్మ తమ మేడల నీడల్లో పరాకుగా పచారులు చేస్తుంటే, "కాద"ని తోసిపుచ్చి, అందని మానిపళ్ళ కాసించడంలో, భాష్యంగారు పొందే ఆనందం శాంత కర్థంకాలేదు. అసలీ నాటకం రంగభంగం కావడానికి కమల నిష్కృతే కారణమేమో! భాష్యంగారికి చిత్రకళంటే తలా తోకా తెలీకపోయినా, తద్వారా నాల్గురాళ్ళు చేసుకునే మంత్రమతనికి కరతలామలకం! ఇప్పటికెన్నో పెయింటింగ్ ఎగ్జిబిషన్లు చేయించాడు - జేబులు నింపుకోడానికే గాని, కళలో ఆసక్తివల్ల సుతరాం కాదని అందరికీ తెలిసిన విషయమే! కానీ లేని కళాకారుణ్ణి కమల వరించడంతో, మనసులో బద్ధవైరం పాతుకుపోయింది రవిపట్ల. కమల మరణంతో యీ వైరం చిరస్థాయి నందుకుంది. ఒక్కసారి కూడా రవి చిత్రాలకు చేయూత నివ్వలేదు. పైగా, కళా ప్రపంచంలో రవికాక అజేయమైన స్థానముందనీ, దాన్నెలాగైనా నాశనం చెయ్యాలనీ, భాష్యంగారి పట్టుదలెక్కువైందీ మధ్య.

ఆయన చేతిలో ఒక కప్పు కాఫీ తెచ్చిచ్చి, లోపలికెళ్ళింది శాంత అతనితో యిక మాట్లాడబుద్ధి కాలేదని వేరే చెప్పాలా! అయినా అతనికి రవి చిత్రం - ఈమధ్య గీసింది - చూపించి తీరాలి....

"రామూ! మొన్న రవీ మామ మీకిచ్చిన బొమ్మేదీ?"

"దేవుడి పటాల దగ్గర పెట్టిందమ్మ. నాన్నగారికెంతో బాగుంటే, అలా చేయమన్నారట. అయినా నాకిచ్చిన బొమ్మ, అమ్మా నాన్నా లాక్కోడం అన్యాయం కాదక్కా?"

దేవుడి మంటపం దగ్గరికెళ్ళి చూసింది శాంత. అద్భుతం! "కచ దేవయాని!" బ్రహ్మాండంగా వుంది! చిద్విలాసంగా సూర్య చంద్రాదులతో వెలుగుతున్న విశాలాకాశంలో, యే మూలో మాటు

మణిగిన చిన్న తారలా, చిత్రం అడుగున సన్నగా సంతకం చేశాడు చిత్రకారుడి పేరు

"ర వి"

"ఓసారి లోపలికొచ్చి, మా తమ్ముడికి మీ 'బావగారు' ప్రెజెంట్ చేసిన చిత్రం చూస్తారా" అంటూ పరుగున దేవుడి మంటపం దగ్గర్నుంచి డ్రాయింగ్ రూమ్‌లోకి పరిగెత్తుకొచ్చింది శాంత!

భాష్యం లేడు.

ఎప్పుడో లేచిపోయాడు!

కమల పరలోకగతం కాకమునుపే "బావ" అని పిలవడం అరుదు, రవిని. పసివాళ్ళు నోరూరా "రవి మామా!" అని పిలుస్తుంటే,సహించలేని ఈర్ష్యాగ్నులతనిలో రగులుతున్నాయని గ్రహించింది శాంత. తనలోతను బాధపడుతూ అనుకుంది-

"భస్మీభూతమైనా, వజ్రాల్లా తేజస్సును విడని జీవితాలెన్ని లేవు!" ఊహల అగ్నిగుండంలో మగ్గుతున్నా, లొంగని రవి పేరు తల్చుకున్నప్పుడల్లా శాంత వర్చస్సులో మెరిసే మంద హాసాని కంతరార్థమేమో ఇది! ఇప్పుడు రోజూ అతనిదగ్గర చిత్రలేఖనం నేర్చుకుని వస్తుంది. పాపికొండల కరకు రాళ్ళ హృదయాల్లో, పాలరాతి 'నిగ' 'నిగ'లు పొదిగే ఉన్మనతా, గర్జించే సింహపు భీషణాకృతిలో గోముఖ ప్రసన్నత దిద్దే చాక చక్యమూ, రవి పట్టుదలతో నేర్పుతున్నాడామెకు. "మీరు" అని పూర్తి చెయ్యాలనుకున్న వాక్యాల్లో తడబాటు చూచి నవ్వుకునేది మొదట్లో. "రవీ!" అని పేరుపెట్టి పిలవడానికీ పెదిమలు కదలడంలా ఇంకా! అభిమానాన్ని మించిన వ్యక్తావ్యక్తమైన మధురభావమేదో ఆమెను "పీడిస్తున్న" దనడానికి సంసిద్ధులం కావచ్చు. కానీ బాహ్యంగా ఒప్పుకోదామె! రవి గదిలో, తుడిచీ తుడవనట్లు అతికిన దుమ్ము నూదుతూ, పుస్తకాల బీర్వామీద అతికించిన చిత్రాన్ని ప్రశంసిస్తుందొకనాడు.

"ఎంత బావుందబ్బా! ఏ కొద్దిమందికో దత్తవరాలిలాంటివి!"

"కొంచెం ప్రమిదలు తుడిచి దీపాలు వెలిగించిపోదురూ. నూనె ఒలకబోసుకున్నా.... చాతగాని వ్యాపరం... కాస్త సహాయం చేద్దురూ!"

"చేద్దురూ" - అనకండి. "చెయ్ శాంతా" అంటే చేస్తాను!" చిలిపిగా జవాబిస్తుంది శాంత....

-పిచ్చిమనిషి!! అసలు కళాకారులంతా పిచ్చివాళ్ళే స్వతః!-

"చీకట్లో కూచోడం మానండింక." శాంత పుణ్యమా-అని గదిలో దీపాలు మళ్ళీ వెలుగుతున్నై!

అన్నా చెల్లెళ్ళులా వారిద్దరూ మెలిగిన దినాలు లెక్క-పెడదామనుకుంటుంది. ఏకోదరత్వానికి భంగంగా పలికిన యే ఒక్క ముక్కో జ్ఞాపకం తెచ్చుకుని ఆమె ముడిచిన వేలు పైకి తీయిస్తుంది. విశిష్ట ప్రేమకు రూపం లేదని వాదిస్తారామెలోంచి ఎవరో!

కొన్నాళ్ళుగా రవి కూడా తనకు తెలియకుండానే శాంత లోని సహృదయాన్ని తొంగిచూస్తున్నాడు! భార్య పోయినప్పటి నుంచీ అపావృతమైన పథాల్లో యేకాకిగా నడుస్తున్న అతని కిప్పుడు "తోడెవరూ లేర"ని భయం వేస్తున్నదేమో, ఆధీనునిలా ఆధారాని కెదురుచూస్తాడు! ఈ ఆశ తనకు కల్పించిన శాంత ఇంటికి వెళ్ళిపోయాక, పోయిన పంచమినాటి మసక వెన్నెట్లో చుక్కల్ని లెక్క-పెడుతూ అనుకున్నది ఒక్కసారే, అతను-

"నేను కమలను మరిచిపోలేదు కదా!!"

చరిత్ర తిప్పి తిప్పి పాత పేజీలు తిరగేస్తుందంటారు. కమల కూడా శాంతలాగే ఒకనాడు అపరిచితురాలు. మర్నాడు తన కళలో తీపి చూపిన శిష్య. మరికొన్నాళ్ళకు ధర్మపత్ని! భావుకుడైన తను, ఇల్లాగే, చేసిన తప్పే చేస్తూ, జీవితం గడుపుతుంటాడా!?

ఈ సందేహం కలగడం, ఇదే అతనికి మొదటిసారి.... రాసిన తప్పును కొట్టేస్తున్నట్టు, గాలిలో వంకరగా చేయి విసిరాడు

"ఛీ.... ఎప్పటికీ కాదు...."

సాయంకాలం కారులో షికారుకు రమ్మంటుంది శాంత. నిక్కచ్చిగా 'వద్ద'ని అడ్డు చెప్పినరోజూ కద్దు. 'రాలేన'ని మెత్త బడిన దినమూ కద్దు.... నిజంగా షికారుకెళ్ళిన దినం మాత్రం కనిపించదు. ఎంత చనువుగా వర్తిస్తున్నా, చిన్న విషయాల్లో స్త్రీని నొప్పించడం పరిపాటీ కాదని రవికి తెలియదేమోనని విచారించేది శాంత....

"ఆకాశమంత కళాతజ్ఞత ఇమిడిన బుర్రలో, యీపాటి చిన్న విషయానికి తావు లేదా!?" అన్న సందేహం ఆమెకు లేక పోలేదు.... లౌకికుడు కాదని తెలిసీ, పట్టుబట్టడం ఆమెదే లోపంగా గ్రహించుకుని, షికారుకు పిలవడమే మానేసింది.

వెలుగుని స్తున్న కొవ్వువత్తి తనలో తానే దిగజారుతున్నది.... మైనంలా శూన్యంపైపుకు బొట్లుబొట్లుగా కారుతోంది కాలం!

*　　　*　　　*

శాంతను చూస్తూ సర్వావసరాలూ మరిచిపోగల స్థితి వచ్చిందిప్పుడు రవికి! ఆమె దగ్గర లేందే, చిత్రం తీయడాని కుపక్రమించనేలేడు! ఎప్పుడో తాను మొదలుపెట్టిన "స్వప్న సుందరి" చిత్రాన్ని పూర్తిచేయడానికి కుంచె అందుకుంటే యెవరో ఛాయగా తన్ను పలకరించి, కలవరపడుతూ మాయ మౌతున్నట్టు కలలు గంటాడు!

"అలసి వచ్చారు.... కొంచెం విశ్రాంతి తీసుకోరూ.... ఏమిటలా చూస్తారూ... నేనే.... మీ క....మ....ల....ను...."

ఇంకో స్థితి ఇది!!!

కానీ—

రాను రానూ రవికీ అంతర్వాణుల్లో అభిమానం తగ్గుతోంది. ఎవరో లోపలనుంచి వాగి వాగి విసిగి మానేసినట్టు, ఆట్టే బలంలేని అనుమానాస్పదమైన భావన మిగిలిపోయిందంతే....

"రవిగారూ!"

పోష్టువాడు!

"అవును. ఇవ్వండి"

ఎక్స్ప్రెస్ ఉత్తరం.

ఎప్పుడో మరిచిపోయిన దస్తూరీ చూడగానే ప్రాణం లేచి వచ్చింది. స్వగ్రామాన్నీ, ఇంటినీ, ఇంటికి వేసిన కప్పునూ బహుశా మరిచిపోగలిగాడేమో కాని, అందులో నివసించే తల్లీ, తండ్రీ, చెల్లెలూ కనుపాపల్లో మెరిశారా ఉత్తరం చూడగానే....

విప్పి చదువుతున్నాడు....

విశాలమైన నుదురంతకంతకూ ముడిబడుతున్నది.... రెండు కళ్ళల్లోంచి గంగా యమునలు కారుతున్నై....

వేళ్ళమధ్య ఉత్తరం బెదురు చూపులు చూస్తున్నది.

ఉత్తరం మూస్తూ - అలసిన ప్రయాణీకుడిలా.... బాణం తగిలిన ఆడలేడిలా, కూలబడి ఒక్క నిట్టూర్పు విడిచాడు....

"మమతలు!.... మందులు!.... వెయ్యి రూకలు!.... అబ్బా!...."

తండ్రి తీవ్ర వ్యాధిపాలైనాడు. చెల్లెలికింకా పెళ్ళి కాలేదు. తమకు లేని బెడద సంఘానికి పట్టింది! రవి పెళ్ళికిగాను చేసిన అప్పు వడ్డీతోసహా కొండల్లా పెరిగింది. రోజూ దమ్మిడీ ఆదాయం లేని మూడు జీవాలకూ తిండి ఖర్చులో మరి! ఇలా, రానూ రానూ, తన తాత ముత్తాతల కాలంనుంచీ తమ కాశ్రయమిచ్చిన కుటీరం తాకట్టుకింద పోతున్నదట! కడసారిగా, 'కొడుక'న్న సంబంధం సార్థకం చేసుకోమనీ, ఒక వెయ్యి రూపాయలైనా సాయం చేయమనీ, అలా చేస్తే "బహుశా, మీ నాన్నగారి ఆఖరు క్షణాలైనా శాంతంగా గడుస్తాయేమో!"నని ఆ లేఖలో రవి తల్లి కన్నీళ్ళు కారుస్తూ ఉదహరించింది....

"ఇంతకూ నువ్వు బాగున్నావా నాన్నా.... మా కోడలు నన్ను జ్ఞాపకం చేసుకుంటుందా.... పిల్లలెందరు.... కమలను మరీ మరీ "అడిగా"నని చెప్పు....!" ఎన్నెన్నో రాసిందమ్మ!

కొవ్వొత్తి కరిగి నేల కొరిగింది....

సగం పూర్తయిన "స్వప్న సుందరి" చిత్రంపైపు చూస్తూ, నిట్టూర్పు విడిచాడు రవి "నీవే నన్ను రక్షించాలి.... నా కుటుంబానికి పునర్జన్మ ప్రదానంచేసి పోషించాలి...."

కార్యదీక్ష భూతంలా ఆవేశించింది! సంయమికి మించిన మనోబలం తాండవిస్తున్నది భృకుటి వంకరలలో!

"జమీందారుగార్ని డబ్బడిగి లాభం వుండదు. శాంత నడగనే అడగను. నా చిత్రం నా కుటుంబాని కన్నదాత కావాలిప్పుడు...."

మధ్యాహ్నం శాంత వచ్చినా పాఠాని కుపక్రమించలేదు.

"శాంతా! ప్రదర్శనం మాటేమిటీ?"

"మరో పక్షం రోజుల్లో జరగవచ్చు. కానీ—" శాంత మాట పూర్తికాకుండానే అంటున్నాడు "నా చిత్రాలు పంపుతున్నా. డబ్బిస్తారా?" అతని అమాయకత్వం రోజుకు రోజూ పెరుగుతున్నట్టు చూస్తూ, గుండె చెరువవుతోంది శాంతకు.... మెల్లగా అంది

"డబ్బెంత.... అవసరమయితే... నేనే-"

"కాదు నా "స్వప్న సుందరి" నన్ను రక్షించి తీరాలి. భాష్యం 'బావ' ఒప్పుకుంటాడా?"

భాష్యం బావ!! రవి జీవితంలో మొదటిసారిగా, భాష్యం-'బావ'గా ఆప్పుడై మారడం శాంత గుండెల్లో తుపాకి గుండులా

పేలింది! "జవాబేం చెప్పాలా" - అని సందేహిస్తున్నది శాంత. ఇంతలో రవి అదుర్దాగా అన్నాడు "సంస్థానాధీశ్వరు లెవరో చిత్రాలు చూడ్డానికీ, కొనడానికీ వస్తారుటగా"

ఆలోచించింది.

మళ్ళీ ఆలోచించింది.

అతని సుఖమే తన సుఖమిప్పుడు....

"అవును పంపించండి.... నేను కూడా మీరు నేర్పిన చిత్రాలు కొన్ని పంపుతా"

"ఓ! అంతకన్నా ఏం కావాలి! ముందు నా "స్వప్న సుందరి" చిత్రం 'విర' 'విరా' పూర్తి చేయాలి!"-

విగ్రహంతో లేచి, అక్కడ శాంత వున్నదని కూడా మరిచిపోయి రంగులూ, కుంచే యేకత్రితం చెయ్యడం మొదలెట్టాడు రవి! మరణశయ్యమీదినుంచి తండ్రిని బ్రతికించాలి.... అప్పుకింద పోనున్న కుటీరాన్ని దక్కించుకుని తీరాలి.... అబ్బ! ఎందరు తల్లిదండ్రులలా సంసార సాగరంలో - యీ దేశంలో- తల్లడిల్లిపోతున్నారో! అమ్మ రాసిన ఒక్క ఉత్తరం, తనలో ఎంత మార్పును తెచ్చింది!! అసలు చిత్రాల ద్వారా డబ్బు సంపాయించాలన్న ఆశ కలగడం రవి కదే మొదటిసారేమో!! "అమ్మ!!" ...."అసలు కమల పోయిందని కూడా తెలీదామెకు పాపం!"

* * *

మళ్ళీ వీధిలో తుపాకుల మోత!!

అలవాటుపడ్డా, కలవరం తగ్గలా ఇవ్వాళెందుకో!

"భగవంతుడా! నీవు సృష్టించిన లోకాన్ని నీవే, లేనిపోని కల్లోలాలతో నాశనం చేస్తావెందుకయ్యా! ఫోనీ .. ఒఖ మనవి.... జీవితంలో యేవో కొత్త ఆశల నంకురింపజేశావ్.... మళ్ళీ అడుగులోనే హంసపాదులు రాకుండా రక్షించు దేవా!...."

ఏమిటో... ఎన్నెన్నో పిచ్చి ఆలోచనలు....!!

* * *

ఎవరో తలుపు కొట్టారింతలో.

"ఎవరది?"

"ఒక్కసారి తలుపు తీస్తారా?"

ఎవరో కొత్త గొంతు!

"ఎందుకూ?"

"చెప్తాను తీద్దురూ...."

తలుపు తీశాడు.

పక్కింటి పంతులు!

ఊసుపోని దినాల్లో అడపా దడపా రవి ఇతనితో మాట్లాడేవాడు కమల బతికున్న రోజుల్లో. అది వీరి మిత్రత్వం కాదు- వృత్తి ముఖపరిచయం మాత్రమే. అతని పాత సంభాషణల వల్ల రవి ఊహించుకున్న విషయ మొక్కటే-

"పని చేయలేని మాటకారి" అని! అంతకన్నా గ్రహించ దలుచుకోలేదేమో అసలు....

"ఈ సామాన్లు మీ ఇంట్లో వుంచనివ్వండి కొన్ని దినాలు. బయట దొంగలమయం కదూ.... మా అన్నగారికొంట్లో బాగ లేదట! తెలంగాణా వెళ్ళివస్తా. ఊర్నించొచ్చాక తీసుకుపోతా లేండి.... మీకేమీ ఇబ్బంది కలిగించను."

'కాద'నడం చేతగాదు రవికి!

"అల్లాగే"

పెట్టె వుంచి, కనీసం 'థాంక్స్' అని కూడా చెప్పకుండా వెళ్ళిపోయాడతను.... పాము కరిచినా చెప్పి కరుస్తుందంటారు!

హడావిడిగా ఇలా జరగడం గమ్మత్తుగానే వుంది రవికి! ఏమి దాచివెళ్ళాడో తన కనవసరం గనక అతడు తిరిగి వాటి విషయం ఆలోచించడం మానేశాడు.

"స్వప్న సుందరి" పూర్తిచెయ్యాలి. ఇప్పుడు జీవితాని కదొక్కటే ధ్యేయం.... తలుపు వేసేశాడు....

నిద్ర రాకున్నా కలలు కంటున్నాడు మళ్ళీ!-

కలలే కుంచె నాడిస్తున్నాయి!!

కలలే భూత భవిష్యత్తులకు పునాది!!

* * *

బ్రహ్మాండమైన ప్రయత్నాలు జరుగుతున్నై 'ఎగ్జిబిషన్'ను విజయవంతం చేసేందుకు. పరుల పలుకుబడి తనదిగా చేసుకోగల మధ్యవర్తిత్వపు కీలకాలెన్నో సాధిస్తారు 'అతి' లోకజ్ఞానం గల చతురులు! భాష్యం సిద్ధహస్తుడీ విషయంలో. ఈ చిత్ర ప్రదర్శనం యేర్పాటు చేయడం మూలంగా, ముక్తి రక్తి చూడందతనికి నిద్ర రాదు. "గొప్పవార"మని భ్రమపడుతున్న చిత్రకారులనెందరినో పిలిపించాడు. ఉన్నతస్థాన మలంకరింపించాడు గోడలమీద వారి చిత్రాలను. రవిని పిలవడానికతని నోరాడనే లేదు. 'ఫ్రీ' అన్న

అభిమానమే శాంత నతను ఆహ్వానించడానికి కారణమై వుండ వచ్చు. అంతకుమించి, ఆమెనుండి అతనేమైనా ఆశించాడేమో నన్నది మరో విషయం!....

రవి ఇంకా కలలు కంటున్నాడే కాని, అసలు సంగతతనికేం తెలుసు పాపం! తల్లిదండ్రుల ఆశయ సంపూర్తికి దోహదం కాగలనన్న ధైర్యం అతనిలో ఉబికిపోతున్న దింకా....

పొద్దున్నే శాంత కనిపించింది మళ్ళీ....

"రవీ!"

"ఊఁ"

చెప్పాలో అక్కర్లేదో ఆలోచిస్తూ ఆలోచిస్తూనే చెప్పేసింది.

"మన చిత్రాలు.... మన చిత్రాలు.... భాష్యం తీసుకో లేదు... నీవి "వద్దం"టే, నేనూ "ఇవ్వను పొమ్మ"న్నాను...."

జాలిగా మట్టి ప్రతిమలా నుంచుని శూన్యంలోకి చూస్తోంది శాంత....

ప్రళయం!!

రవి కలలన్నీ మాయమయ్యా యొక్కసారిగా!!....

పోనీ శాంతనే డబ్బడిగితే!

"ఛీ!"

ఇన్నాళ్ళుగా పూలూ కాయలుగా యెదుగుతున్న ఆమె మిత్రతను తన తుచ్ఛ అవసరాలను తీర్చుకోడానికి వినియో గిస్తాడా?! కానీ....

కన్నతండ్రి పంచప్రాణాలూ నీలినీడల్లా సోకినై రవి హృదయంలో.... దిగులుగా కిటికీలోంచి బైటి ప్రపంచాన్ని ఏహ్యంగా చూస్తూ శాంతను పిలిచాడు.

"మరీ...."

అడగదలుచుకున్నది నోరాడలేదు.

"చెప్పండి ... డబ్బు కావాలా?"

"కాదు.... ఏం చెయ్యమంటావ్ శాంతా... ప్రదర్శనంలో పాల్గొని తీరాలి...."

శాంతకు గుండెల్లో నీళ్ళు తిరిగాయి. ఇన్ని దినాలుగా అతనితో కలిసి మెలిసి తిరుగుతోందే కాని, అతనికీ తనకూ వున్న సంబంధం మరెప్పుడూ వూహించుకోలేదు. కనికరానికీ, ప్రేమకూ అట్టే భేదం లేదేమో! రవి జాలి చూపులామెను ముక్కలు చేస్తు న్నాయి.... ఎలా అతన్ని ఓదార్చాలో తెలియడం లేదామెకు.... ఒక్కసారిగా ముద్దు పెట్టుకుందామనిపించింది!!!

కానీ—

అడుగు తీసి అడుగు వెయ్యలేకపోయింది....

రవిలోనూ అదే యుద్ధం జరుగుతోందని ఆమెకేం తెలుసూ!

దెబ్బతిన్న హృదయం ఉపశాంతిని కోరడం సహజమే....

"అక్కా!"

రామూ పిలవడంతో వీరి ఆలోచన లొక్కసారి సద్దుమణి గాయి.

"భాష్యంగారు మనింటికొచ్చారు. మాట్లాడాలిట నీతో"

"పొమ్మను. వసుంది. ఇప్పుడు రాను" ఆలోచించ కుండానే అనేసిందావేశంతో. తనకు ఆప్తుడైన రవి చిత్రాలు స్వీకరించడానికే వెనుదీసే చవటలందరూ తనకు స్నేహితులా!

రామూ వెళ్ళిపోయాక అన్నాడు రవి "శాంతా! నా "స్వప్న సుందరి" చిత్రం చూస్తే భాష్యం 'బావ' ముగ్ధుడై పోతాడు. రమ్మనరాదూ?"

"అసలు చూపించకండి. అతనే ఎప్పుడోకప్పుడు చూడ్డం పడితే, మిమ్మల్నడగనందుకు సిగ్గు తెచ్చుకుంటాడులెండి.... అయినా నాకు మాత్రం చూపించారేంటి మీరింకా!"

"పూర్తవుతోంది. భగవంతుడికన్నా ముందు నీకే చూపిస్తా."

ఆ చిరునవ్వు, అందాకా మగ్గుతున్న ఇరువురి అశాంతినీ ఛేదించింది!

అన్నదామె "నేనొక ప్లాన్ వేశాను. ఎగ్జిబిషన్ హాల్ మన జమీందారు కృష్ణదాసుగారిదే. వారు మనకు ఆప్తులే గదా! భాష్యంగారి చిత్ర ప్రదర్శనం లోపల రూమ్‌లో జరుగుతుంటే, హాలు బైట వరండాలో అదే సమయానికి మనిద్దరి చిత్రాల ఎగ్జిబిషన్ హుంషారుగా జరుగుతుంది! జమీందారుగారికేమీ అభ్యం తరంలేదుట. మరొకరి కాళ్ళు పట్టుకోవాల్సిన అవసరం లేదింక. ఎవరేమనుకున్నా అనుకోనీ - మనిద్దరం...."

శాంత మాటలు పూర్తికాలేదు.... పొంగిపోతున్న ఆవే శంతో ఎగిరి నుంచున్నాడు రవి! తన చిత్రాలే తన హృదయాన్ని స్పందించే సునిశిత భావాలన్నింటికీ సాక్షులు! ఒక్కసారిగా కవ ళించుకుని శాంతను ముద్దు పెట్టుకున్నాడు నఖశిఖ పర్యంతం!!

ఐక్యమైన అంతరంగాల్లో దైహిక సుఖానికి మించిన బ్రహ్మానందం తాండవమాడింది!

*            *            *

హోరుగాలి.

పగిలిపోయిన కమల పటానికి కట్టిన తాడు 'గిల' 'గిలా' కొట్టుకుంటోంది పంజరంలోంచి జారి కుంపట్లో పడిన పావురంలా..

రవీ, శాంతా, దివినుంచి భువికి దిగేటప్పటికి గడియారం ముళ్ళు రెండుసార్లు పైనుంచి కిందికీ పైకీ వలయాలు కొట్టాయి!

సిగ్గుగా కిందికి చూస్తూ బుగ్గ తుడుచుకున్నది శాంత. చిరునవ్వుతో పెదిమలు మూరుని విల్లులా వంపు తిరిగినై ...

"వస్తాను"

క్షణం చూచీ చూడనట్టు నుంచుని, పరిగెత్తిపోయిందామె. చీకటిలో దోగాడే పసిపాపలా ఒంటరితనపు భయం వేసింది రవికి! మళ్ళీ ఆమె వచ్చేదాకా గడియారమాగిపోతే బాగుండు....

*            *            *

క్షీరసాగరంగారి బంగళా. తడబడిన హృదయంతో కారు దిగింది శాంత. ఎదురుగా వచ్చాడు తమ్ముడు రామూ "అక్కా! పిచ్చిపని చేశావే...."

"ఏం? ఎందుకూ?"

"భాష్యం మామ నీవీ, రవి మామవీ బొమ్మ లడగడానికి మనింటికొచ్చాడట. నిన్ను పిలిస్తే రాలేదేం? కోపమొచ్చి వెళ్ళిపోయాడు...."

"పోతే పోనీ. నేనేం చేస్తా మరి!"

అనగలిగిందే గాని, అతిబాధపడింది శాంత!

*            *            *

ప్రదర్శనం జరగబోతోంది. చూడవచ్చిన ప్రముఖులతో కిక్కిరిసింది పరిసరం. భవనం ముందు ఖాళీ గదిలో శాంతా, రవీ చిత్రాలు వీధిచివరి బడిపంతుళ్ళూ, పిల్లలూ అంతా కలిసి అందంగా అమర్చిపుంచారు. 'పద్దన్న' వచ్చేపోయే వార్నందర్నీ ముద్దుగా పిలిచి "అక్కయ్యా, మామయ్యా" వేసిన చిత్రాలను చూపించాలని ప్లాన్!

వీళ్ళిద్దరూ మాత్రం వార్తావాహినిలా ప్రవహిస్తుందో చూద్దానికి కాచుక్కూచున్నా రనతి దూరంలో శాంత కారులో!....

ఇటు, సొంత పనికి బ్రహ్మాండమైన పబ్లిసిటీ చేశాడు భాష్యం! ఆనాటి దినపత్రిక లన్నీ దర్శనీయమైన చిత్రాలు గీచిన కళాకారుల బొమ్మలతో వ్యాసాలు ప్రచురించాయి. రవి, స్వగ్రామంలో వున్నప్పుడో స్నేహిత బృందముండేది. వారిలో యెందరో, ఇతని దగ్గర నేర్చుకుంటూండగానే, తనకు పూడు వదలడం తటస్థించింది. ఇప్పుడు వాళ్ళ ఫొటోలే పేపర్లో! వారే భాష్యంగారి అన్నదాత లివ్వాళ!!

పెద్దలందరూ యూడవస్తున్నారు. భాష్యం పూలదండలతో వాళ్ళ నాహ్వానిస్తున్నాడు. అతిథులు లోపలికి వెళ్ళేలోగా, రవి శాంతల చిత్రాల గదే ముందు తగులుతుంది.

ప్లాన్ ప్రకారం రామూ, రోహిణీలతో సహా రంగురంగుల చొక్కాలూ, గౌన్లూ తొడుక్కుని, హఠాత్తుగా నృత్యభంగిమలతో దణ్ణాలు పెడుతూ పిల్లలందరూ "రండి మహానుభావుల్లారా!" అన్నట్టు సాష్టాంగపడ్డారు పెద్దలకు!

అనుకోకుండా జరిగిన యీ నాటకం చూస్తూ, వొళ్ళు మండింది భాష్యంగారికి! అయినా, ఏమాత్రం గొడవ జరుగుతున్నట్టు బైటివాళ్ళకు సుతరాం తెలియగూడదు... తెలివైనవాడు కదా! రహస్యంగా కళ్ళెర్రజేస్తూ పసివాళ్ళను యుడిపించాడు!! భయపడి స్థబ్దులై 'డ్రిల్'లోలాగా వరసగా నుంచుని యేం చేయాలో తోచక దూరంగా శాంత కారువైపు చూస్తున్నారు పిల్లలు.... చేతులు తన ప్రదర్శనంవైపు తిప్పుకుంటూ అమాంతంగా తోలుకుపోయాడు పెద్దల్ని, తియ్యతియ్య మాటల్లో ఇరికించిన భాష్యం! దూరంనుంచి చూస్తున్న రవీ, శాంతల గుండెలు నీరవుతున్నయ్!

లోపలికి పోబోతున్న (డాబుగా 'డ్రెస్' చేసుకున్న) ఒక పెద్దమనిషి దగ్గరికెళ్ళి ధైర్యంగా, తీవిగా రామూ అన్నాడు "మామా! ముందీ గదిలో మాంచి బొమ్మలున్నై... చూసి పోతారా?"

రామూ చురుకుదనం చూసి మనసులో మెచ్చుకుంటూ, అయన ముందు నడుస్తున్న భాష్యాన్ని వెనక్కు పిలిచి "పిల్లలు పిలుస్తున్నారు. ఈ రూమ్‌లో గూడా చిత్రాలున్నాయిట. చూసి పోదామంటారా?" అన్నాడా పెద్దమనిషి. దేవుడి ఆజ్ఞ అయినా, పూజారి సెలవివ్వొద్దూ! "అ.... ఏ ముందులేండి.... లోపల పిల్ల వెధవలు పిచ్చిబొమ్మలు గీశారంతే...." భాష్యంగారిలా అనగానే, పాదాలా ముందు గదిలోకిబో నుంకించినా, మానుకుని అందరితో పాటు లోపలికెళ్ళాడా పెద్దమనిషి!

అందమైన ఆడపిల్లలిద్దరు చలాకీతో అతిథులకు. ఆనాటి చిత్రాల గొప్పదనాన్ని బోధ చేశారు.... మధ్యలో కమ్మటి "టిఫిన్"తో "కాఫీ"లు తిరిగి తిరిగి రౌండ్లు కొట్టింది.... చూపించిన చిత్రాలన్నీ చూశారు.... భాషణ విన్నారు.... పోగత్తల "క్రైపె"క్కింది.... కొనమన్నవన్నీ కొన్నారు.... వేలను మింగేశాయా సంఖ్యలు!

తిరిగి వెళ్ళిపోవడమూ అయిపోయింది!

అతిథులను పంపించాక భాష్యం, అడ్డొచ్చిన పిల్లల్ని తోసుకుంటూ, రవి, శాంతల చిత్రాలున్న గదిలోకెళ్ళి తీక్షణంగా పర్యవేక్షణ చేశాడు. అట్టహాసంగా క్రూరపు నవ్వులు నవ్వు కుంటూ బైటికొచ్చాడు. కారులో రవీ, శాంతా ఉదాసీనులై కూర్చోడం కంటబడింది.

"ఓహో! శాంతమ్మగారే "స్వప్నసుందరి" కామోసు!!" అంటూ హేళనగా నవ్వుతూ దూసుకుపొయ్యాడు!!

ఆ దురుసు మాటల భావమేమిటో అసలర్థం కాలేదు శాంతకు. భాష్యాన్ని చెప్పుతో కొట్టాలన్నంత కోపం వచ్చింది! "ఠపీ"మని కారు తలుపు తెరిచి పరిగెత్తింది హాలు బైట గదిలో సొంత చిత్రాలున్నచోటికి! ఇదంతా చూస్తూ నివ్వెరపోతున్న రవి కళ్ళకు కమ్మిన కన్నీటి పొరల్లో, హృదయం లేని లోకం తన వికృతాకారపు ప్రతిబింబాన్ని చూచుకుంటున్నది! గదిలో శాంత మొదటిసారిగా, పరిశీలనా ప్రవృత్తితో "స్వప్న సుందరి" చిత్రాన్ని చూస్తూ చూస్తూ అక్కడే కుమిలి కూచుంది శిలా విగ్రహంలా!!

పిల్లలు పరిగెత్తుకుంటూ వచ్చి రవి మామను గదిలోకి పిల్చుకెళ్ళారు.

శాంత నోటిమాట రావటం లేదు!

"ఏమైంది శాంతా!?"

"............"

పిల్లలందరూ బిత్తరపోయిన మొహాలతో చూస్తున్నారు..

"నా మీద ఒట్టు.... చెప్పు శాంతా!"

కళ్ళు తుడుచుకుంటూ అన్నది-

"అబ్బా! మీ మతి పోయింది!"

"ఏం!"

"స్వప్నసుందరిట!! నా బొమ్మ గీశారు!"

"ఆశ్చర్యంగా - తీక్షణంగా - తను గీసిన చిత్రాన్నే గుర్తుపట్టనట్టు చూస్తూ చిత్తరువులా స్తంభీకృతుడైనాడు రవి! పోల్చుకున్నకొద్దీ కళ్ళు చెదిరిపోతున్నాయి! తనముందు నుంచున్న శాంతా, ఆ చిత్రమూ అచ్చుగుద్దిన ట్టొకేరూపం!

మెల్లగా అడిగాడతను ప్రశ్నార్థకంలా వొంగుతూ-

"పోనీలే.... నీకెలా తెలిసింది?"

"మీరూ విన్నారుగా.... పోతూ పోతూ ఆ క్రూరుడేమన్నాడో! అసలు నన్నడుగుతారేం?-మీ 'బావ'నే అడగండి..."

అయోమయంగా వుందిద్దరికీ!

ఇంతలో మరో ఆవేశం ఆమెను కమ్ముకున్నది!

"అంత ప్రేమా రవికి నామీద!! కమలను పూర్తిగా మరిచిపోయాడు పాపం!! ఇప్పుడు నేనేనా అతని కలలరాణిని!!"

దిగులుపడాలో, నవ్వాలో తోచని పరిస్థితి! అనన్యమైన తియ్యటి నొప్పి కలిగించే ప్రేమ బాణాల ధాటికి తాళలేక నిశ్శబ్దంగా అతని కళ్ళలోకి చూస్తూ నుంచున్న శాంతతో అన్నాడు రవి—

"అయిందేదో అయింది.... పోదాం రా శాంతా..."

ఆనాటికి శాంత నింట్లో దింపివచ్చాడు. అగమ్యగోచరంగా వుందతనికి! ఆధీనం తప్పిన జీవితపు కళ్ళెం మళ్ళీ పట్టుకులాగి తీసుకురావాలని అదిరిపోతున్నాయతని హస్తాలు.... కమల చనిపోయిననాటి అశాంతి తిరిగి ఆవరించినట్టు తపనగా వుంది మనస్సులో.

మెరుపులా మెరిసిందొక ఆలోచన!!

చేసి తీరాలి!!

వాకిలి గడియ 'ఠపీ'మని బిగించి వచ్చాడు!

నీలిమబ్బుల్లో ద్యోతకమవుతున్న ఇంద్రధనుస్సు రంగులను పోల్చుకుంటూ కుంచె శరవేగంతో కదుల్తోంది.

ఇక, ఆఖరుసారిగా తను గీయబోయే చిత్రమదే!!

జన్మ సార్థకం కావాలి!

*　　*　　*

తలుపు కొట్టిన శబ్దం. స్త్రీ కంఠం.

మారు గొంతుతో జవాబిచ్చాడు "రవి ఇంట్లో లేదు."

నెలల తరబడి గీచినా పూర్తిగాని చిత్రాలనేక మున్నాయతని దగ్గర. నిముషాల మీద పూర్తిచేస్తున్న యీ చిత్రాన్ని చూస్తే అతన్ని సామాన్య మానవుడనుకోము!

దిక్కులు చూస్తూ రేఖలు దిద్దుతున్నాడు....

కలిపిన రంగులు కలవకుండా అంచులు దిద్దుతున్నాడు....

తలుపు కొట్టే శబ్దాలధిక మౌతున్నాయి!

ఇప్పుడు మధ్య మధ్య, దూరంగా పేలుతున్న తుపాకీ గుండ్ల రొద కూడా!

కళలో అంతర్లీనమైన వ్యక్తులకు భగవంతుడు కనిపిస్తాడు.... ఆత్మశాంతి లభిస్తుంది.... పూర్తిచేసిన చిత్రాన్ని చూస్తూ చూస్తూ మురిసిపోతూ బ్రహ్మానందాన్ని పొందుతున్నాడు రవి! కానీ - నానా భ్రమలతో కుంగిపోతున్న యీనాటి లోకానికి తుపాకీగుండ్లు తప్ప, తుంబురు గానస్రవంతి సహిస్తుందా మరి!

బయట గావుకేకలు! "తలుపుతీ.... లేకపోతే బద్దలు కొట్టాం.... తీ త్వరగా...."

మరో ప్రపంచపు మధుర స్వప్నసీమలో ఆనందంగా డోలలాడుతున్న రవి ఒఖ్ఖసారిగా ఉలికిపడ్డాడు!

ఆలస్యం - అమృతం - విషం!

ఇక ధైర్యంగా త్వరపడి తీరాలి!

మెల్లగా ఒక స్త్రీ కంఠం. సుపరిచితమైన గళం....

"క్షణంలో నీవు నా వాడివి కావు.... తలుపులు తీయవూ.... రవీ!"

కిటికీలోంచి అగ్గిపుల్ల తీసి, కనపడ్డ తన చిత్రాలన్నిటినీ ఒక్కుమ్మడి నిప్పంటించాడు! కొత్తగా గీసిన చిత్రాన్ని జాగ్రత్తగా మరో మూలకు చేర్చి, యజ్ఞం పూర్తి చేసినట్లు సఫలీకృతంగా వెర్రినవ్వు నవ్వాడొక్కసారి!

దడీలున తలుపు తీశాడు!

ఎర్ర టోపీల గుంపు!

పోలీసుల బూట్లు!

గుండె చెరువులా యేడుస్తోంది శాంత!

"అడ్డం లేండి. ఇల్లు సోదా చెయ్యాలి" పోలీసులన్నారు.

శాంత అడ్డు తగిలింది-

"అతనేం తప్పు చేశాడనీ?"

"మీకేం తెలుసు.... అడ్డంలేండి..."

చిత్రాలెన్నో కాలుతున్న కనరు కంపు....

తలుపు బార్లా తెరిచారు. సామాన్లు బైటికి విసిరేశారు. ఇల్లంతా బీభత్సం చేశారు. కొండను తవ్వి ఎలుకను పట్టినట్టు ఒకమూల నుంచి తీగలకట్టా, రెండు సుత్తెలూ, ఇనప ముక్కలూ, ముగ్గులాంటి తెల్లపొడితో ప్లాస్టిక్ సంచీ, కాయితాల కట్టా స్వాధీనం చేసుకున్నారు.

పక్కింటి పంతులు పొరుగూరు పోతూ రవి గదిలో పెట్టిన పెట్టెతాలుకు సామాన్లవి!!!

నివ్వెరపోయి చూస్తున్నాడు రవి!

"నడు పోలీస్ స్టేషనుకు"

"అల్లాగే. ఒక ఉత్తరం రాసివస్తా. ఒఖ్ఖ నిమిషమాగండి" పోలీసులకు జవాబిచ్చాడు రవి. అతను ఆత్మబలి కోసం తయారయ్యే, తలుపు తీశాడని శాంతకు కూడా తెలీదేమో పాపం! విలవిలపోతూ యేడుస్తున్న శాంతనతను ఓదార్చనే లేదు....ఉత్తరం గీసేస్తున్నాడు——

"అమ్మా.... నాన్నా ....మీ ఋణం తీర్చుకోలేకపోయాను. అర్థంలేని ఆశయాలతో నా జీవితమే కాక, మీ బ్రతుకులకు కూడా చిచ్చుబెట్టాను.... క్షమించరూ.... కమల పోయిన సంగతి బహుశా మీకు తెలీదేమో... చెల్లాయికి నా ఆశీస్సులు.... అమ్మా.... నాన్నా .... ఈ లోకంలో సంభవించలేదు.... పరలోకంలోనైనా మిమ్మల్ని కలుసుకుని తీరుతాను, ప్రత్యక్షంగా క్షమాపణ కోరుకోడం కోసం.... ఎక్కడికెళ్తున్నానో నాకే తెలీదు....

సెలవు.... మీ "రవి"——

పోలీసులు తీసుకెళ్ళిపోయారు! చేసిన తప్పు ఇప్పటికీ గ్రహించుకోలేదతను! ఎన్ని సంవత్సరాలలో శిక్ష విధించినట్టుంది!! వ్రాసిన ఉత్తరం ఎక్కడికి చేరుతుంది? పిచ్చివాడు - తండ్రి మరణించిన విషయం కూడా తెలీదతనికి.... తిరిగివచ్చే తిరాణాకు కూడా అందుకునేవాళ్ళు లేరిప్పుడా ఉత్తరాన్ని!

ఈలోగా ఈ కబురు విన్న కృష్ణదాసుగారూ, క్షీరసాగరం గారూ, రామూ, రోహిణీ - భాష్యం 'బావ'తో సహా - అందరు పరిచితులూ హాజరయ్యారా యుద్ధభూమికి! రవి నేరస్థుడని నమ్మబుద్ధి కాలేదెవరికీ! - చకితులై ఇదమిద్ధం తెలీకుండా నుంచున్నారు వాళ్ళు!

కొండంత దుఃఖంతో శాంత కూలిపోతుంటే, కష్టైలా నుంచుని చూస్తున్న భాష్యంగారికి కించిత్తు జాలివేసినట్లనిపించింది!

కానీ!!—

ఆ పక్కింటి పంతులును మందుగుండు సామాన్ల పెట్టెతో రవి గదికి పంపింది "తానే"నని బ్రహ్మదేవుడికి కూడా తెలీదేమో!!!

* * *

బుద్ధుడి అర్ధనిమీలిత నేత్రాలతో తన్ను బుజ్జగించినట్టు చూస్తూ పోలీసుల సంకెళ్ళతో కదలిపోతున్న రవి విగ్రహమే శాంత గుండెల్లో బాకులు పొడుస్తున్నది ప్రతిక్షణమూ....

"అక్కా! ఇదిగో రవిమామ గీచిన ఆఖరు చిత్రం!" రామూ, రోహిణీ ఆ బొమ్మను తీసుకొచ్చి శాంతకివ్వబోయ్యారు.

"ఆగండాగండి.... ఈ బొమ్మ ఎవరిదో తెలుసా?" భాష్యంగారన్నారు కోపంగా!

"ఎవరిదండీ?" జమీందారు కృష్ణదాసుగారడిగారతన్ని.

"ఏం చెప్పను స్వామీ! - మిగతా బొమ్మలన్నీ అతను తగలబెట్టాడెందుకో! - ఇది మాత్రం మా "బావ" నా కోసం మిగిల్చి వుంటాడనుకుంటా. ఇది మా చెల్లెలు కమల బొమ్మండీ!"

జీవితకాలంలో కలలు సాకారం కాకుండానే కాలచక్రంలో విలీనమైన కమల "స్వప్న సుందరి"గా మారిందిప్పుడు! కన్నీటి అలలలో మునిగి తేలుతున్న ఆ ప్రతిబింబం శాంతను వెక్కిరిస్తోంది ప్రతిక్షణమూ!

* * *

బొమ్మ తీసుకుని, అమ్మేందుకు అప్పుడే ప్లాన్లు వేస్తూ నిష్క్రమించాడు భాష్యం.

# కవిత

కవిత
ఆవేదనానందాల మిళిత
కవిత
స్వార్థపర నిర్మూల హరిత
సమ సమానతల సంగమ సంత
కవిత
నిజాన్నుష్టించే గరిత
ఇది విజ్ఞాన జనత
మానసోల్లాసానంద మధుర మృదుల వింత
కవిత
భావికి పునాది వేసే భవిత
అభ్యుదయ సవిత
నిరంతర జీవిత
యుగయుగాల పతిత
కవిత
ఇది నవరసాల గుంభన
సుఖదుఃఖానుభూతుల స్పందన
ఇది విక(ర)సి(చి)స్తే నందన
అందుకే అభినందన
కవిత
హృదయాంతరాల్లోని తమస్సు
అనిర్వచనీయం దీని తేజస్సు
కొత్త భావుటాకిది ఉషస్సు
అనంతం దీని యశస్సు
ఇది కవి చేసే తపస్సు
దశ దిశలు దీని ఆయుస్సు.

శ్రీ శ్రీవాటి శ్రీనాథ్



## వానా - వాడూ

వాన వాడి ప్రాణం
వాన వాడి జీవితం

వాన కోసం వాడు తపస్సు చేస్తాడు
వాన పడితే చాలు ఎగిరి గంతులు వేస్తాడు

జల్లులు జల్లులుగా వాన కురుస్తోంటే
సంతోషంలో వాడు తనని తానే మరుస్తాడు

వాన వరదై పారుతోంటే
వాడి గుండెలోంచి ఆనందం వరదగా పొంగుతుంది

వాన రాగానే
వాడి నాగలి లేచి నడుస్తుంది

వాన పడగానే
వాడి మడిలో వేసిన విత్తనం మొలుస్తుంది

వాన కురిసింది మొదలు
వాడి చేను పచ్చగా నవ్వుతుంది

వాన కురవగానే
వాడి చెరువు సముద్రమై పోతుంది

వానా కాలంలో
వాడి క్షేత్రం సుందరలోకంగా శోభిస్తుంది

వానలో తడిసిన
వాడి మేనిలో చైతన్యం పొంగుతుంది

వాన వాడి ఆశ
వాన వాడి స్వప్నం
వాన వాడి ధనం
వాన వాడి దైవం
వానే లేకుంటే వాడు లేడు
వాడే లేకుంటే ఎవడూ వుండడు
వాడు ఒళ్ళొంచి పని చేస్తాడు
ప్రపంచానికింతన్నం పెడతాడు

వాన వాడి స్వప్నం
వాన వాడి దైవం
వాన వాడి ఆశయం
వాన వాడి జీవితం.

శ్రీ తిరునగరి

## అక్షరం కాదు; అక్షయ కవిత!

అనుభూతిని
అక్షరం అందుకోలేనప్పుడు
అందించే ప్రయత్నంలో
అలసిపోయిన ఆలోచన
నా చూపుల్ని
ఆకాశంలో ఆవిష్కరించినప్పుడు
అందమైన ఓ చుక్క పొడుస్తుంది

అనుభవాల్ని అనుభవించిన
అంతరంగంలో దాని ఆశా కాంతి
తళుక్కుమంటుంది....
ఓ శీత జ్వాల
నా మనసు నుంచి తనువులోకి
తనువు నుంచి మనసులోకి
కిరణయానంతో ఉద్గమిస్తుంది....
ఇప్పుడు నా మనసులో తీయదనం
ఏ చెలిమి చిలికిన మకరందమో మరి
ఎదలో ఏరులా పొంగుకొస్తుంది
అంతలో
తరుణ కాంతలైన నా తలపులు
బిద్దకంగా ఒళ్లు విరుచుకుంటూ
వలపు పయ్యెద సర్దుకు లేచి కూర్చుంటాయ్
ఆ పొంగులో స్నాన పునీతలౌతాయ్
చేతనా సదృశమైన ఆ చిన్నారులు
మాధురీ మహిమను మాటల్లో వింపుకుని
ఆనంద తీరాన వెలసిన అమృతమూర్తి
అతివ భారతి పూజకు
అరుణ చరణాలతో హంస గమనాలతో
సాగిపోతాయ్....!
అంతే—
అక్షరం నాది
అక్షయ కవితగా అవతరిస్తుంది
అమృతమూర్తి కప్పుడే
పొడమిన నవ్వును
అంతరంగానికి పులుముకుని...!
అరవిందలో చని చూచు కరుచిని
ఆత్మ లోపల పోల్చుకుని....!!

శ్రీ కరూచిభొట్ల వెంకటశాస్త్రి

డా॥ వెలగా వెంకటప్పయ్య

# సి. పి. బ్రౌన్ సేకరణలు

సేకరణ అనేది ఒక కళ. అది అందరికీ చేతకాదు. కేవలం సేకరించి భద్రపరచడాన్ని బిబ్లియోమానియా అంటారు. వీటిని సేకరించేవారు చదవరు. ఇతర్లను వినియోగించుకోనీరు. ఇది డబ్బు సంపాదించే జబ్బులాంటి వ్యసనం. ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్ (1798-1884) అలాగాక సేకరించి ప్రతి రాతప్రతిని సంస్కరించి, ముద్రణ ఏర్పాట్లు చేశాడు. మిగతావి భద్రంగా ముందు తరాలవారికి ఉపయోగించేట్లు చేశాడు.

విశేషం ఏమంటే జాతిరీత్యా ఆంగ్లేయుడైన బ్రౌన్ భారతదేశంలోనే - కలకత్తాలో జన్మించాడు. తండ్రి డేవిడ్ బ్రౌన్ కలకత్తా మిషనరీలలో పనిచేసేవాడు. 1817లో మద్రాసులో ఉద్యోగంలో చేరేదాకా తెలుగుభాషనేది ఒకటున్నదని తెలియదట.

బ్రౌన్ వెలగపూడి కోదండరామయ్య పంతులుగారివద్ద తెలుగు నేర్చుకున్నాడు. తెలుగుమీద అభిమానం పెంచుకున్నాడు. ఆ తర్వాత మచిలీపట్నం, రాజమండ్రి, కడప, గుంటూరు మొదలైన పట్నాలలో అనేక హోదాలలో పనిచేశాడు. ఎక్కడ పనిచేసినా తన విరామ సమయంలో తెలుగు గ్రంథాల అధ్యయనం, పండితగోష్ఠి, రాతప్రతుల సేకరణలపైనే తన సమయాన్ని వెచ్చించాడు

ఇక్కడ మనం చెప్పుకోవాల్సిన విషయం ఒకటుంది. బ్రౌన్ కడపలో ఉండగా నేడు మనం ఎంతో వికృత రూపంలో రాస్తున్న సి యు డి డి ఎ పి ఎ హెచ్ ని సి ఎ డి ఎ పి ఎ లేదా కె ఎ డి ఎ పి ఎ (చూ. స్వీయచరిత్ర, పు-37, 32) అనే రాసేవాడు. వ్యవహారయోగ్యమైన స్పెల్లింగ్, సజీవభాష అంటే బ్రౌన్‌కు ఎంతో ఇష్టం. భారత జాతీయ గ్రంథసూచీవారు ప్రకటించిన ధ్వనిరూప పట్టికను అనుసరించి కడపను కె ఎ డి ఎ పి ఎ అనడం సమంజసం. ఈ స్పెల్లింగును పునరుద్ధరించాల్సిన అవసరం ఉంది.

బ్రౌన్ 26వ ఏటనే గ్రంథ సేకరణకు పూనుకొన్నాడు. అప్పటివరకు లభ్యమౌతున్న రాతప్రతులను సేకరించ నిర్ణయించాడు. అప్పటివరకు ఈ మంచిపని చేయాలని ఎవరికీ తోచలేదు. కొద్దికాలంలోనే 553 సంపుటాలలో 1092 కావ్యాలను, పురాణాలను సేకరించాడు. పండితులను నియమించి వీటిలో కొన్నిటిని పరిష్కరించాడు. వ్యాఖ్యానాలు రాయించాడు. పద సూచికలు (కాంకోర్‌డెన్సెస్) అంటే ఎరగని దినాలలో ఆ సూచికలు తయారుచేయించాడు. వీటికితోడుగా సర్వసమగ్రమైన వ్యవహార నిఘంటువును తయారుచేసే ఉద్దేశంతో ప్రజలు రాసుకున్న లేఖలను, అధికారులకు పెట్టుకున్న అర్జీలను, జానపద కథలను, గేయాలను అపారంగా సేకరించాడు. ఇందుకోసం అప్పట్లో (1824-1836) పన్నెండేళ్ళ కాలంలో ముప్పయివేల రూపాయలు వెచ్చించాడు.

డాక్టర్ లీడెన్ కృషి :

బ్రౌన్ కంటే ముందు కలన్ మెకంజీకీ (1754-1821), జాన్ లీడెన్‌కు పుస్తకాల సేకరణ పిచ్చి ఉండేది. ఈయన డాక్టరు. 1806లో భారతదేశంలో అడుగుపెట్టేడు. పారశీకం, దక్షిణాత్య భాషలు అధ్యయనం చేశాడు. 1811లో జావా యుద్ధంలో పాల్గొన్నప్పుడు ఒక భవనంలో చాల అమూల్య గ్రంథాలున్నాయని విని భవనం తలుపులు తెరిపించాడు. అందు ప్రవేశించాడు. చాల ఏళ్ళుగా భవనం మూసి ఉన్నందున విష వాయువులు సోకి లీడెన్ మూడు దినాల్లో కన్నుమూశాడు. డాక్టర్ విండన్ భారతదేశంలో ఉన్న కాలంలో సేకరించిన సంస్కృతాంధ్ర, పారశీక భాషాగ్రంథాలు 1811లో లండన్‌లోని ఇండియా ఆఫీస్ గ్రంథాలయానికి తరలించాడు. మరల వీటి సంగతి పట్టించుకున్న నాధుడు లేడు.

1837లో బ్రౌన్ సెలవుమీద లండన్ వెళ్ళినపుడు ఈ గ్రంథాలను చూశాడు. వీటిని భారతదేశం చేర్చితే సద్వినియోగం అవుతాయని భావించి అధికారుల దృష్టికి తీసుకువచ్చాడు. అందుకు కుంఫిణీ ప్రభుత్వం అంగీకరించింది. ఈ గ్రంథాలు మద్రాసు చేరాయి.

ఈ విధంగా మెకంజీ, డా॥ లీడెన్, బ్రౌన్ సేకరించిన సంకలనాలు 1845లో మద్రాసు లిటరరీ సొసైటీకి దానం చేశారు. వీటి వివరాలు ఇలా ఉంటాయి.

సంకలనాలు 2440 (తెలుగు, తెలుగు లిపిలో
్రత గ్రంథాలు).

ండన్ సంకలనాలు 2016 (తెలుగు, సంస్కృతం,
భాషలు).

కీ సంకలనాలు 913 (హెచ్చుగా దక్షిణ భారతీయ
).

లిటరరీ సొసైటీ సంకలనాలు 292 (సంస్కృతం,
భారతీయ భాషలు).

మొత్తం 5751. బ్రౌన్ 1855లో ఇంగ్లండ్ వెళ్ళే
ంథాలయానికి రాతప్రతులు చేర్చుతూనే ఉన్నాడు.
యానికి మొత్తం 4 వేల రాత ప్రతులనైనా చేర్చి
ఉహ. 1855 ఫిబ్రవరి 1వ తేదీ జరిగిన సొసైటీ
సమావేశంలో బ్రౌన్‌కు సభ్యులు కృతజ్ఞతలు తెలిపారు.

867లో బ్రిటీషు ప్రభుత్వం ప్రత్యేకంగా ప్రాచ్యలిఖిత
భాండాగారాన్ని స్థాపించినపుడు పైన వివరించిన ముగ్గురు
యులు సేకరించిన రాతప్రతులు ఈ గ్రంథాలయానికి
పరచబడ్డాయి. తదుపరి వేటూరి ప్రభాకరశాస్త్రి, ప్రభృ
సేకరించిన రాతప్రతులతో, పిఠాపురం, వెంకటగిరి,
త్త్యాల జమీందార్లవద్ద గల గ్రంథాలను ఇచటికి చేర్చడంతో
చ్యలిఖిత గ్రంథాలయం పరిపుష్టమైంది.

సూచీ తయారీ :

బ్రౌన్ ఉద్యోగరీత్యా ఒక అసౌకర్యానికి గురైనప్పుడు
1834-37 మధ్యకాలంలో లండన్‌లో ఉన్నాడు. ఆ సమయంలో
కూడ భారతదేశానికి సంబంధించిన పనే చేశాడు. ప్రొఫెసర్
విల్సన్ అభ్యర్థనపై దక్షిణ భారతీయ భాషలలోని రాతప్రతులకు
సూచీ తయారుచేశాడు. మరల 1855 నుంచి 1884లో చనిపోయే
వరకు లండన్‌లోనే ఉండి 1863లో కర్నాటిక క్రోనాలజీ,
1866లో స్వీయచరిత్ర అచ్చేశాడు. 1884లో వీలునామా రాసి,
తన మరణానంతరం తన పుస్తకాలు, రాతప్రతులను ఇండియా
ఆఫీస్ గ్రంథాలయానికి దఖలు పరుస్తూ విల్లు రాశాడు. వీటిని ఆ
గ్రంథాలయానికి చేర్చడానికి 10 పౌండ్లు ఖర్చును కూడ కేటా
యించాడు.

తెలుగు సూర్యుడు బ్రౌన్ మరణానంతరం వారి గ్రంథా
లన్నీ ఇండియా ఆఫీస్ గ్రంథాలయానికి చేరాయి. 1974లో
శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం బ్రౌన్ ప్రాజెక్టు చేపట్టినపుడు
లండన్‌లోని ఇండియా ఆఫీస్ గ్రంథాలయంలోనూ, బ్రిటీషు
మ్యూజియం నుంచి సి. పి. బ్రౌన్ రచనలకు, అముద్రిత రాత
ప్రతులకు మైక్రోఫిల్ములను తీయించి సేకరించుట జరిగింది. ఇవి
మొత్తం 52 సంపుటాలు, 25,000 పుటల వరకు విస్తరించి
ఉంటాయి.

సేకరణకు స్థానికుల సహకారం :

బ్రౌన్ రాతప్రతులు సేకరించడానికి అనేకులు స్థానికుల
సహకారం తీసుకున్నాడు. వారిలో అయోధ్యాపురం కృష్ణారెడ్డి
ఒకరు. కృష్ణారెడ్డి బ్రౌన్ ఉద్యమానికి సహాయపడుతూ - ఎంతో
చేదోడు వాదోడుగా ఉండేవాడు. కృష్ణారెడ్డి ఉద్యోగరీత్యా కడప
కోర్టులో నాజరుగా ఉంటూ బ్రౌన్ బంగళా అజమాయిషీ చూసే
వాడు. బ్రౌన్ గ్రంథాలయాన్ని నిర్వహించేవాడు. పండితులు
బ్రౌన్ బంగళాలో ఉంటూ వ్యాఖ్యలు, ప్రతులు రాస్తూ, గ్రంథాలు
సేకరిస్తూ ఉంటే కృష్ణారెడ్డి అందరికీ జీతభత్యాలు సర్దుతూ బ్రౌన్
దొరవారికి లెక్కలు చెబుతూ ఉండేవాడు. 1840లో బ్రౌన్
ధర్మవరం సుబ్బన్నకు రాసిన జాబు చూస్తే తనకు సాయపడే
వారియెడ బ్రౌన్ చూపే శ్రద్ధ వ్యక్తమౌతుంది.

ధర్మవరం సుబ్బన్నకు—

మహారాజశ్రీ శి. పి. బ్రౌన్ దొరవారు వ్రాయించిన ఆజ్ఞ
యేమంటే - నీవు మా పేర వ్రాసి పంపించిన వుత్తరం చదువ్వ
కోంగా చాలా సంతోషమయినది. వుత్తరం పట్టుకుని వచ్చిన
మనిషికి భత్యాఖర్చు కింద వక రూపాయి యిప్పించి వున్నాము.
మాకు కొన్ని గ్రంథములు కావలశివుండగా జాగ్రత్త చేస్తానని
వ్రాసినావు గనుక సంతోషించినాము. అట్లా చేసిన పక్షమందు
అయ్యేఖర్చు ముజరా యిప్పిస్తున్నాము. మరిన్ని భానుమద్విజయం
అనే తెలుగు గ్రంథం కడపలో యిప్పుడు దొరికితే దానికి ప్రతి
పుట్టించుకుని పది రూపాయిలు యినాం యిప్పిస్తున్నాము. మాతృక
మా దగ్గెరకు పంపించడానకు అభ్యంతరమయ్యే పక్షమందు
అక్కడనే ప్రతి పుట్టిస్తున్నాము. ముఖ్యంగా యిది శైవ కావ్యము.
అయిదు ఆశ్వాసములు గలది. వెలగపూడి కృష్ణయ్యాకవి చెప్పినది.
యిది తెలుగు కావ్యము గనుక వకవేళ కడపలో దొరకవచ్చును.
వయిగా వయిడిమఱ్ఱి వెంకటపతి చెప్పిన చంద్రాంగద చరిత్ర

అయిదు ఆశ్వాసములు గలది ముఖ్యం కావలశియున్నది. యిదిగాక జంగమ పుస్తకాలలో కొన్ని కావలశియున్నవి. అవి కన్నడభాష గనుక కన్నడవాండ్ల వద్ద విచారించవలెను. యేవంటే— ప్రభులింగలీల, బసవ పురాణం, బసవ కాలజ్ఞానం, వీటిలో ముఖ్యంగా లీల కావలసినది గనుక దానికి రెండు మూడు ప్రతులు దొరికే పక్షమందు చాపా చేయించేటందుకు మాకు భావం కలిగి వున్నది. యీ పనికిగాను అక్కడ యేదయినా వక పుస్తకం వ్రాయించవలసి వచ్చే పక్షమందు సాధారణంగా వచనం రీతిగా వ్రాయవలశినది. పద్యములు నాలుగేశి చరణములుగా యేర్పర్చి వ్రాయవలశిన జరూరు లేదు.

వ్రాత అయిన తరువాత మొకాబిలా చేయించవలశినది. యీ మనిషి నీ తావుకు పొయ్యేటప్పుడు వీనివరంగా నీ తావుకు కొన్ని పుస్తకములు దానంగా పంపిస్తున్నాము. సదరహి వ్రాశిన గ్రంథములే కాకుండా యీ దిగువను వ్రాశిన గ్రంథములు కూడా మాకు కావలశి వున్నవి. గనుక వీటిని గురించి కూడా తలాషు చేశి పంపించవలెను.

1 సూర్యతనయా పరిణయం
1 చారు చంద్రోదయం
1 పండితారాధ్య చరిత్ర
1 రత్నావళి పరిణయం
4

యీ పుస్తకములు కూడా జాగ్రత్తచేశి పంపిం యిటని మా |

ది 12 డిశంబరు ఆన 1840 సం. (సంతకం-సి

చివరిగా ఒక విషయం గమనించాలి. బ్రౌన్ కాలంలో సంపాదించిన ప్రతి పైసా, తీరిక ఉన్న తెలుగు భాషా సాహిత్యాల అభ్యున్నతి కోసం వెచ్చిం వంటి అపూర్వమైన వ్యక్తి, అసాధారణమైన ప్రజ్ఞా ముందు చూస్తామన్న నమ్మకం లేదు. హంసగీతం ఆ తెలుగు సాహిత్యానికి జీవం పోశాడు. ఇన్ 1825 తెలుగు డెడ్. ఇన్ థర్టీ యియర్స్ ఐ రైజ్‌డ్ ఇట్ టు లైఫ్ సగర్వంగా తొడగొట్టి 1868లో చెప్పుకున్నాడు. రః మించని బ్రిటీషు సామ్రాజ్యం భారతదేశంలో అస్తమిం తెలుగు సూర్యుడు బ్రౌన్ చూపిన వెలుగులు కలకాలం ఉంట

# కాలము – ప్రేమ

## కేప్టెన్ యం. శ్రీనివాసులు

క్షణికమైన కోపానికి, నిరంతరం
బానిసగా నిలిచిన దౌష్ట్యానికి
అఖండమైన గోపురాలు
నేల మట్టమైనప్పుడు,

శిధిలమై, సమాధియైన యుగపు
గర్వకారణాలైన విలువలు
క్రూరమైన కాల హస్తాన నలిగి
వికృతమవడం నే చూసినప్పుడు,

ఆకలిగొన్న సాగరుని కెరటాలు
తీరాన్ని కబళింప చూస్తుంటే
అంచులు అఖండాన్నే గెలుస్తూ
నష్టాన్ని నిలువతో, నిలువను నష్టంతో
వృద్ధిచేస్తూ నిరంతరం పోరాడటం,

పరిస్థితులు స్థానాలను మార్చుకోవటం,
స్థితి క్షీణతతో కలగా పులగంగా
కలిసిపోవడం నే చూసినప్పుడు-

నా ప్రేమను నా నుండి విడదీసే
సమయం రాబోతుందని
గతాన్ని అలా నెమరువేయమని
నేర్పింది నాకు "సర్వనాశనం"

కాని-

కాంక్షించేదాన్ని వొదులుకునే
రోజొస్తుందనే రోదన మినహా
కోరుకునే స్వాతంత్ర్యం ఇవ్వని
ఈ వేదాంతం చావుతో సమానం!

(షేక్స్‌పియర్ "టయిమ్ అండ్ లవ్"కు స్వేచ్ఛానువాదం)

# మాట్లాడే చిత్రాలు

విన్న రేపటికి చరిత్ర
విన్నటి వర్తమానం, రేపటి చరిత్రల మధ్య
నేడు, నేను జీవితమై నిలుస్తాను.

చూచినవీ విన్నవీ చదివినవీ
మనసు తా కన్నవీ
ఏకాంతంగా మౌనంలో దాక్కుని
మననం చేసుకుంటూ కూర్చుంటే—
శాంత గోదావరిలా ప్రవహించే ఊహలూ
ఉరకలేసే మధురోహల ఈహలూ
ఒకోసారి మేఘాంచలాల మెరుసుకుంటూ
మరోసారి తీరాలను ఒరుసుకుంటూ
పరుగు పందెం వేసుకుని
పోయి పోయి
నా రక్తంలో రక్తమై
-సాగరునితో సంలీనమయ్యే నదిలా—
మనసులో నిక్షిప్తమై
జలపాతపు టురుకులతో
నరాల కాలువల ద్వారా
కరాన ప్రవహించి
నా కలంలో సృజనశక్తి సిరా పోసి
కాగితం మీద అల్లుతవి
మాట్లాడే చిత్రాలు!
ఆ కలం కదలికలో
అక్షరాలు పదాలుగా
పదాలు పాదాలుగా
పాదాలు
నా ఆలోచనల అక్షరాకృతిగా
రూపొందిన భావాల బాహ్య రూపాలు
ఆ చిత్రాలు—
పదిమందిని పలుకరిస్తవి!
పది మేనులు పులకరిస్తవి!
పది హృదయాలను విరియిస్తూ
ఎందరికో ఆనందాన్ని
ఏ కొందరికో అనుభూతినీ పంచుతూ
యెద యెదనూ కుదిపి
మది మదినీ కదిపి
కాలవాహినిపై తేలుతూ.... తూలుతూ....
ఆ మాట్లాడే చిత్రాలు....

# ఆశాంకురం

దండిగా, నిండుగా
సౌందర్యం తొణికిసలాడే నిండు గర్భిణి
ప్రసూత్యానంతరం కోల్పోయిన యౌవనంలా-
ఆకాశాని కందంగా

కనులకు విందుగా - ఆ హరివిల్లు....
నా కనులముందే కరగిపోయింది!
ఒకప్పటి 'నేను' గుర్తుకొచ్చాను—
జీవిత యౌవనపు ఫ్లవర్ వాజ్
చేయిజారి శకలాలై చెదిరిపోయింది!
మధుర స్మృతుల గాజుముక్కలు పోగుచేసి
చెదిరిపోయిన చిరునవ్వులు
తిరిగి అతుక్కుంటూంది మనసు.
అతికే ఒకో ముక్కలో
ఒకో స్మృతి వెలుగు—

చిన్నతనపు వల్లమాలిన అల్లరితనం—
యౌవనపు అనుభవ రాహిత్యం ఫలితం—
అణగారిన ఆశయాల ఆక్రందన—
కవితామతల్లి పాదమంజీరాల సవ్వడి—
చేయని నేరానికి పడ్డ శిక్ష—
విడుదల కాక మిగిలిపోయిన కావ్యకన్యలా
కంటతడి పెట్టే కన్నకూతురు—
ఓడిపోయిన మంచితనపు విలాసం
.... .... .... .... .... ....

ఇలా
పలురకాల అనుభవాల స్మృతులు
పేర్చుతూన్న సుమపాత్ర
శక్తి లేని చేతి పట్టు తప్పి పడి
ఈసారి ముక్కలు గుండై పోయి—

చిత్రం పూర్తిచేసి
చివరి మెరుగులు దిద్ది చూసుకుంటూ
సంతోషంతో మురిసే చిత్రకారుడు;
చేతిలోని రంగుగిన్నె ఒలికిపోయి
చిత్రమంతా చిందరవందరై

నిశ్చేతనంగా నిలిచిపోయినట్టు—
తెరుచుకుసున్న కనులు చూపు కోల్పోయి
నేను....

మసలుకొన్న మనసులో
—రాలిన పండులోని విత్తు
మొలకెత్తి విస్తరించి
సుమించి ఫలించడం—
ఒక కొత్త వెలుగు విరిసింది.
ఆశ అంకురించింది!

## శ్రీ మేకా సుధాకరరావు

# పాటలా ప్రవహిస్తుంది జీవితం

బతుకు చివరకంటూ
ఒంటరిగా
నువ్వు నువ్వులా మిగిలిపోకు
సమస్యలు నవ్వుతాయి - గాయాల
ప్రశ్నల్ని రువ్వుతాయి - బాధల
వేదాంతాల వైరాగ్యాల్ని
విడుదల చేస్తాయి - ఆలోచనల
ఉప్పెనల దండయాత్రలో
నీవు కొట్టుకుపోతావు
పిరికివానికి
జీవితం భయపెట్టే మృత్యు తరంగం
పరిక్రమిస్తే
పచ్చదనపు పరిమళాలు నిశ్వసించే
మానవతా మధుతేజం

డొక్క బరువుని మోస్తున్నవాడు
సూదిపోట్ల స్మృతుల్ని దాస్తున్నవాడు
దుఃఖానికి గుండె గుడి కట్టి భరిస్తున్నవాడు
ముల్లు గుచ్చుకుంటున్నా నవ్వడం నేర్చుకున్నవాడు
కనుకొలకుల్లోనే దొర్లుతున్న
కన్నీళ్ళ రుచి తెలిసినవాడు
బతుక్కు
అద్దం పడుతూనే ఉన్నారు
హృదయాన్ని కడిగేసి కలల్ని నెమరేస్తూనే ఉన్నారు
ఆశల పొలిమేరలు వెతుక్కుంటూ
భయిద ధాత్రిని చీల్చుకుంటూ పోతున్నారు
జనసముద్రాల మించి మృత్యు కెరటాలమించి
ఈదుకుంటూ పాటలా ప్రవహిస్తుంది జీవితం

## 'ముత్యాల'

కీ|| శే|| రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ

# ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహము

ఆదికవి :

మనకు తెలిసినంతవరకును ఆంధ్రభాషలో సాహిత్యము ప్రారంభమయినది క్రీ.శ. పదుకొండవ శతాబ్దపు ప్రారంభమున. అంతకుమునుపు సుమారు మున్నూరు నన్నూరేండ్లుగా సలక్షణమయిన పద్యరచనము జరుగుచుండినట్లు శాసనముల ఆధారమున నిశ్చయింపవచ్చునప్పటికిని, సంపూర్ణమయిన ఏ కావ్యనామము కాని, కవి పేరు కాని, మనకు తెలియరాలేదు. సంస్కృత సాహిత్యమున వాల్మీకివలె, ఆంధ్రభాషలో 11వ శతాబ్దపు ప్రారంభమున నుండిన నన్నయ భట్టారకుడే ఆదికవి యను వాడుక బహుకాలము నుండి కలదు. అతడే ఆంధ్రభాషను కావ్యపురాణాది రచనకు ఉపయోగపడునట్లు సంస్కరించి, మొట్టమొదట వ్యాకరణమును రచించెనను ప్రవాదమును కలదు.

కాని పదుకొండవ శతాబ్దమునకు వెనుక బహుప్రబలముగా నుండి, ఇతర భాషలలో అనేక మహాప్రబంధములను రచించిన జైనులు ఆంధ్రభాషలో కూడ రచింపక ఉండరనియు, ఆంధ్రదేశములోని అద్వైతులును, శైవులును, వైష్ణవులును ఒక్కొక్కచోట ప్రబలురై దాని తరువాత జైనులను దేశమునందే ఉంచక బయటికి గెంటినందువలన, వారితర దేశములకు వలసపోయిన కాలమున తమ గ్రంథములను వెంటనే తీసికొనిపోయి యుండవలయుననియును, కాలక్రమమున ఇతర భాషలవారికి ఈ గ్రంథములలో శ్రద్ధ లేక అవి నష్టమైపోయి యుండవచ్చుననియును, కొందరభిప్రాయపడుదురు. దీనికి సమర్థనముగా ఆంధ్రదేశమున జైనుల సంఖ్య అతి స్వల్పముగా నుండుటయు, ఇదివరకును ఒక జైన గ్రంథమైనను తెనుగున కనులబడక పోవుటయు, విచారార్హములైనవి.

శిథిలమతావేశము :

జైనులను పరుగెత్తించుటలో ఇట్లు శైవులును, వైష్ణవులును, అద్వైతులును ఐకమత్యముతో పనిచేసి కృతకృత్యులయినను, తుదకు అద్వైతమతమే మిగిలిన రెండింటిని అణగద్రొక్కి ఆంధ్ర సాహిత్యమున అధికముగ ప్రచారమునకు వచ్చెను. బసవేశ్వరుని కాలమున కొన్ని వీరశైవ గ్రంథములను విజయనగర రాజుల కాలమున కొన్ని వీర వైష్ణవ గ్రంథములను ఉద్భవించినను, మొత్తమునకు శివకేశవుల యందు సామ్యదృష్టి గల గ్రంథములే తెనుగున అధికముగా కనపడును. ఇప్పుడును వీరశైవులకు కానీ, వీరవైష్ణవులకు కానీ కన్నడ తమిళ దేశము లందున్న సంఖ్యాబలము తెలుగుదేశమున లేదు. ఇక, బౌద్ధమతము మన దేశమున బహుకాలము క్రిందటనే పూర్తిగా అంతర్ధానమై యుండెను. ఈ మధ్య వచ్చిన మహమ్మదీయ, క్రైస్తవ మతములకు సంస్కారులయిన ఉత్తమ జాతులవారు అంతగా చేరకున్నందునను, చేరినవారి దృష్టి ఉర్దూ, ఆంగ్లభాషల యందే ఇంకను నాటియుండుట వలనను, ఆ మతములకు తెనుగు భాషా సాహిత్యమును సృష్టిచేయు శక్తి ఇంకను రాలేదు.

ఆంధ్రాద్వైత బ్రాహ్మణులలో వైదికులనియు, నియోగులనియు రెండు శాఖలు కలవు. మొదటివారు శ్రౌతస్మార్త కర్మలలో నిరతులై, సంస్కృత సాహిత్యసేవలో అభిమానము కలవారు. రెండవ నియోగులు నూతన సంస్కార ప్రియులు; రాజకీయ తంత్రములందు నిపుణులు. అందుచేత, దేశభాషలో వీరికి పాండిత్యమును, అభిమానమును అధికము. అందువలన ఆంధ్ర సారస్వతమున ముక్కాలు భాగము వీరు రచించిన గ్రంథములే హెరాళముగా నున్నవి. ఇట్లు జైనులు, బౌద్ధులు, మొదలగు అవైదిక మతములకు చెందినవారు ఆంధ్రదేశమునే వదలిపెట్టి పోవుటవలనను, మతప్రచారకులైన బ్రాహ్మణు లందరును ప్రాయశః అద్వైతులయి యుండుటవలనను, ఇతరులకు శివునిలో కానీ, విష్ణువులో కానీ తీవ్ర భక్తిద్వేషములు కలుగుట కవకాశము లధికముగా లేక, ఆంధ్ర సాహిత్యమున మతావేశమునకు సంబంధించిన ప్రోద్బలము తక్కువయ్యెను. వీరశైవుడైన పాల్కురికి సోమనాథుని బసవ పురాణము, వీరవైష్ణవుడైన విజయనగర చక్రవర్తి కృష్ణదేవరాయల ఆముక్తమాల్యద, ఇంచుమించు పదునేడవ శతాబ్ది తరువాత బ్రాహ్మణుల ఆధిక్యమును ప్రతిఘటించి, జాతి భేదాదులకు విరోధముగా సర్వసమత్వమును, ఆత్మ సంధానమును బోధించిన వేమన పద్యములు-ఇట్టి కొన్నిటిని విడిచిపెట్టిన, ఇతర బ్రాహ్మణులును, బ్రాహ్మణేతరులును రచిం

చిన గ్రంథములందంతయు, వారు వంశపరంపరగా శైవులో, వైష్ణవులో అయియుండినను - త్రిమూర్తి స్తుతి, గణపతి పూజ, మున్నగు హరిహరాద్వైత మత చిహ్నములు ప్రాయశః స్పష్టముగ కనబడును.

రాజాశ్రయము :

ఇట్లు సామాన్యముగా దేశభాషలలో గ్రంథరచనకు ముఖ్య కారణమయిన మతావేశము శిథిలమైనందువల్ల, తెలుగులో గ్రంథ రచనకు అధికముగా కీర్తి, ద్రవ్యము మొదలగు ఇతర కారణములే మూలములై పరిణమించినవి. సామాన్యముగా కీర్తి, ద్రవ్యములు రెండును రాజుల చేతిలోని వస్తువులై యుండుటవల్ల, కవులు విధిలేక రాజాశ్రయము చేయవలసి వచ్చినది. కాని, రాజులకు కవుల నాశ్రయించవలసిన నిర్బంధము కలిగిన తప్ప, వీరికి వారివలన లాభము కలుగదు కదా? అందుచేత, సప్త సంతానములలో ప్రబంధ రచనను ముఖ్యముగా పరిగణించ వలయునవియు, ఈ శాస్త్రము ప్రబంధము రచించినవాని కంటెను వ్రాయించినవానికెక్కువగా అన్వయించుననియు రాజుల మనస్సులో నాటునట్లు కవులు బోధించిరి. ఈ కారణములచేత, ఆంధ్ర సాహిత్యమున బహుభాగము రాజభవనముల నీడలయందే తయారయ్యెను. పూర్వకాలమున రాజుల పరిపాలనలోని అధికారులును యథాశక్తిగా అన్ని విధముల రాజులవలెనే ప్రవర్తించుచున్నందున, వారును కవులను బలిపించి, చేతనైనంత బహుమానించి, వారితో గ్రంథములు వ్రాయించిరి. తమకింతటి ఆశ్రయమొసగి పోషించిన 'కృతిభర్త'ల నామధేయములు చిరస్థాయిగా నొనర్చుటకు 'కృతికర్త'లు తాము వ్రాసిన గ్రంథము లందలి విషయమునంతయు ప్రత్యక్షముగా వారికి పురాణము చెప్పునట్లు ఆశ్వాసాంతము వారిని కృతజ్ఞతా భక్తులతో సంబోధించి వ్రాసి, నూతనమైన అంకిత పద్ధతి నొకదానిని నెలకొలిపిరి. ఇట్లు ధనికుడైన ఒక వ్యక్తి ఆశ్రయమున గ్రంథరచనము చేయు పద్ధతి ఇప్పుడును తెనుగులో నశించలేదు. ఆంధ్రదేశమున ఇప్పుడును రాజులు, పాళెగాండ్రు, జమీందారులు పలుమంది కలరు. ఇప్పుడును తెనుగు రచయితలకు వారి ఆశ్రయమును వదలుట సాధ్యము కాలేదు.

కాని రాజుల ఆశ్రయమున సర్వమును సుఖమయమని ఎవరును చెప్పజాలరు. కొందరికది లభ్యము కాదు; మరికొందరి కది లభ్యమయినను రాజుల సేవ వారికి అచ్చిరాదు. జవాను మొదలుకొని దివాను వరకును ఒకటే విధముగా తలవంచి సేవ చేయకున్న ఆస్థానమున ప్రవేశమే సాధ్యము కాదు; సాధ్యమైనను ఫలకారి కాబోదు. అందువలన, ఆంధ్రకవులలో కొందరు అటువంటి దైన్యమును తలపెట్టక, స్వతంత్రులుగా తమ ఇష్టదేవతలకు అంకితముగా గ్రంథరచన మొనర్చిరి. రాజుల కంకితముగా గ్రంథములను వ్రాయుట నరకమునకు దారి అనియును నమ్మిరి! అయినను, మొత్తము మీద ఆంధ్ర సాహిత్యమునకు జీవము నింపి, నడిపించినవారు రాజులే అని ధారాళముగ చెప్పవచ్చును. తమ కంకితముగా గ్రంథములను వ్రాయించుట రాజధర్మములలో నొకటి అన్న నమ్మిక రాజుల కందరికిని ఉన్నందువలననే, 16వ శతాబ్దమున ఇబ్రహీం మల్కి అన్న గోలకొండ మహమ్మదీయ సుల్తాను కూడ ఇద్దరాంధ్ర కవులను పోషించి, రెండుత్తమ కావ్యములను తన కంకితముగా వ్రాయించుకొన్నాడు! కొందరు తెనుగురాజులు స్వతంత్రముగా గ్రంథరచన చేసిరి. కొందరు ఇతరులచేత వ్రాయించి, తమపేర ప్రకటించుకొనియుండుటను కూడ చూడవచ్చును.

ఇట్లు రాజాశ్రయమునే ఎక్కువగా నమ్ముకొనియున్న ఆంధ్ర సారస్వతము, వెనుక చెప్పినట్లు 11వ శతాబ్దమున వేంగి దేశము రాజధానియగు రాజమహేంద్రవరమున పూర్వ చాళుక్య వంశమునకు చెందిన రాజరాజ నరేంద్రుని ఆస్థానమున తలసూపి, తరువాత కాకతీయులు, రెడ్డిరాజులు, విజయనగర నృపాలురు, మొదలగువారి సామ్రాజ్యములందు అభివృద్ధి చెంది, క్రమముగా మధుర, తంజావూరు, మైసూరు, పుదుకోట మొదలగు ఆంధ్రేతర రాజ్యములందును శాఖోపశాఖలుగా పెరిగినది.

శాస్త్ర సాహిత్యము :

ఆంధ్ర వాఙ్మయమున వైద్య, జ్యోతిష, గణిత, ధర్మ, సాముద్రిక, యోగ — ఇత్యాది శాస్త్రములలో గ్రంథములు ప్రారంభము నుండి వ్రాయబడియున్నను, వాని సంఖ్య స్వల్పము; ప్రామాణికతయు తక్కువ. ఇక తర్క వేదాంతాది చర్చా శాస్త్రములు కేవలము సంస్కృత పరిభాషతో నిండియుండుటవల్లను, వానిలో కొన్ని దేశభాషలలో జనసామాన్యమునకు తెలుపరాని పవిత్ర గ్రంథములన్న భావముండుటవల్లను, అవి సంస్కృత పీఠములనుండి క్రిందికి దిగిరాలేదు. వచ్చిన గ్రంథములును ముఖ్యములైన తత్త్వ విషయములను మాత్రము సూచించునే కాని, విస్తరముగ విషయచర్చ చేయవు. ఇట్లగుటచే తెనుగున వ్రాయబడిన శాస్త్ర గ్రంథములన్నియు ముఖ్య విషయములు మరచి

# “ఏమండీ. ఆ భరించలేని నొప్పి ఏమైంది?”

“పోయిందే!”




మేలుపరచబడిన **అమృతాంజన్** వాడడంతో.

కోమలమైన **అమృతాంజన్**ను చాలా సులభంగా రాసుకోవచ్చు.

మృదువైన **అమృతాంజన్**తో చాలా సులభంగా ‘మర్దనా’ వేయవచ్చు.

తలనొప్పులను, వొళ్ళు నొప్పులను, కీళ్ళ నొప్పులను, కండరాల నొప్పులను మరియు బెణుకులను మేలుపరచబడిన అమృతాంజన్ మునపటికంటే **అతి** త్వరితంగా వుపశమింపజేయగలదు!

# మేలుపరచబడిన
# అమృతాంజన్

Amrutanjan Limited



మీ మోముపై చిరునగవులను శీఘ్రంగా- తిరిగి వికసింపజేయగలదు!

OBM 149 TG R

పోకుండుటకు చేసికొన్న గుర్తు దత్తములని మాత్రము చెప్ప వలసి వచ్చును. మల్లినాథుడు, అన్నంభట్టు, పండితరాజు, జగన్నాథుడు, లక్ష్మీధరుడు - మున్నగువారు మహా ప్రతిభావంతు లయిన శాస్త్రజ్ఞులు. వారాంధ్రులయినను వారి ప్రతిభ సర్వమును సంస్కృత భాషలో బహిర్గతమయినదే కాని తెనుగున దాని గుర్తే కనిపించదు!

పురాణయుగము :

ఆంధ్రుల ప్రతిభ ఆంధ్రభాషలో పురాణ కావ్యముల రూపముననే ప్రవహించెను. కావ్యప్రపంచమునను వారు నాటకముల జోలికి పోలేదు. సంస్కృత కావ్యపద్ధతిని ఆమూలాగ్రముగ అనుసరించుకొని వ్రాసిన తెనుగు కవులకు ఆ భాషలో చాల అభి వృద్ధి కాంచిన నాటకములను తమ భాషకు దిగుమతి చేసికొన వలయునను ఆశ ఎందుకు పుట్టలేదన్నది ప్రత్యుత్తరము లేని ప్రశ్న. శాకుంతలము, ప్రబోధ చంద్రోదయము మున్నగు నాటకములను తెనుగున పద్యకావ్య రూపమున వ్రాసికొని యున్నారు. కాని వానిని నాటకముల రూపముననే పరివర్తన చేయుటకైనను మొన్న మొన్నటి వరకును ఎవరును ప్రయ త్నించలేదు. ఇక కావ్యరచనకు కావలసిన అలంకారము, ఛందస్సు, రసము, వ్యాకరణము - వీనికి సంబంధించిన కొన్ని గ్రంథములున్నను కూడ, అవియును పైన పేర్కొన్న ఇతర శాస్త్ర గ్రంథములకన్న ఎక్కువ ఉన్నత స్థితియందున్నవని చెప్పుటకు వీలులేదు.

విషయ ప్రధానమైనది పురాణము; రచనా ప్రధానమయినది కావ్యము. సులభశైలిలో కథ, నీతి, ధర్మము - మున్నగు విష యములను సామాన్యుల ఎరుక కొరకు బోధించుటయే పౌరాణికుల కర్తవ్యము. కావ్య కవులట్లు కాక, పైన పేర్కొన్న విషయముల నాధారముగా చేసికొని, దాని మూలకముగా శబ్దార్థాలంకార రచనలో తమకున్న సామర్థ్యమును ప్రకటించవలెనని ప్రయత్నింతురు. ఈ కావ్యశైలికి 'ప్రబంధశైలి' అని ఇప్పటి ఆంధ్రులు పేరు పెట్టి నారు. నిజమగు కావ్యధర్మములను పరీక్షించిన కావ్యమన్న పేరు పురాణములకే తగియున్నను, కొన్ని పురాణములలో కావ్య శైలియు, కావ్యములలో పురాణశైలియు కలసిపోయి యున్నను, ఈ పురాణ కావ్యవిభాగము ఎట్లో సామాన్య వ్యవహారమున వచ్చి నిలిచినది. ఆంధ్ర సాహిత్య ముపక్రమించిన కాలముననే ఆదర్శభూతమయిన సంస్కృత వాఙ్మయమున పైన పేర్కొన్న రెండు తరగతుల రచనలును చాల ప్రాముఖ్యము బడసియుండి నవి. అందువల్లనే తెనుగున సాహిత్య రచనకు చేయివేసిన పండితులకు మొదటినుండియు ఈ రెంటిపైనను దృష్టి ప్రస రించెను. కాని, సంస్కృత భాషలోని మహాభారతాది గ్రంథము లను పండితులచేత చదివించి, దేశభాషలో నిత్యమును పురాణము విను సామాన్య జనులకు ఆ గ్రంథములపట్ల కలుగు అభిమాన మును, అభిరుచియును, కావ్యపు కసరత్తులందు కలుగదు. అందువలన, ఆంధ్ర కవులలో చాలమంది ప్రప్రథమముగా మహా భారతాది పురాణములను సంగ్రహముగాను, యథోచితములగు మార్పులతోను అనువదింప ప్రారంభించిరి.

కవిత్రయము :

రాజరాజ నరేంద్రుని ఆస్థాన పండితుడైన నన్నయ భట్టారకుడు మహాభారతపు భాషాంతరీకరణమును ప్రారంభించి, అరణ్యపర్వమున కొంతభాగము వరకు నడపి, కాలధర్మము చెందెను. తరువాత సుమారు 13వ శతాబ్దపు మధ్యభాగమున నెల్లూరు సంస్థానమున మంత్రిగా నుండిన తిక్కన యను సోమయాజి విరాటపర్వము మొదలుకొని 15 పర్వములు పూర్తి చేసెను. అతనికి కవిబ్రహ్మ యను బిరుదము కలదు. ఆంధ్ర సాహిత్యమున ఆ బిరుదుకు ఇతడు తప్ప మిగిలిన వారెవ్వరును తగినవారు కారని ధారాళముగ చెప్పవచ్చును. తరువాత 14వ శతాబ్దిలో శంభుదాసుడన్న కవి అరణ్యపర్వ శేషమును పూర్తి చేసెను. ఆ ముగ్గురికిని కవిత్రయమన్న పేరు కలదు. వీరి ప్రయోగములే వైయాకరణులకు పరమ ప్రమాణముగా నిలిచినవి.

ఇట్లు ప్రారంభింపబడిన పురాణ రచన సుమారు 16వ శతాబ్దము వరకును పెరిగెను. రామాయణము, భారతము, హరి వంశము, బసవ పురాణము, మార్కండేయ పురాణము, విష్ణు పురాణము మొదలగు పురాణములు తెనుగున సిద్ధమయ్యెను. రామాయణాదులను కొన్నిటిని వేరువేరుగా పలువురు వ్రాసిరి. వీరిలో 15వ శతాబ్దములోని భాగవతమును వ్రాసిన బమ్మెర పోతరాజు చాల ప్రఖ్యాతుడు. భక్తిరస ప్రధానమగు నీతవి గ్రంథమున కున్నంత వ్యాప్తి ఇంకే గ్రంథమునకును కనిపించదు. రాజాశ్రయమును తిరస్కరించి, స్వతంత్రించి, పేదతనమునందే కాలక్షేప మొనర్చిన తెనుగు కవులలో ఇతడగ్రగణ్యుడు. కొందరు పూర్తిగా ఇట్లు పురాణములను వ్రాయుటకు బదులుగా, వానిలోని కొన్ని ఉపాఖ్యానములను మాత్రము స్వీకరించి, వ్రాసిరి. ఇట్టి వారిలో 15వ శతాబ్దపు శ్రీనాథుడన్న కవి సుప్రసిద్ధుడు. ఈ ఐదారు శతాబ్దములను 'పురాణ యుగ'మని ఆధునికులు పేర్కొందురు.

చిత్ర కవిత్వము :

ఈ యుగమునను కావ్యరచన మీద కొందరి దృష్టి పోకుండ నుండలేదు. కుమార సంభవమన్న వర్ణనా ప్రధాన కావ్యము, విద్వాంసుల కొషధమైన నైషధాంధ్రీకరణమును ఈ కాలముననే ప్రభవించినవి. దశకుమార చరిత్రము, భోజ రాజీయము, మున్నగు పురాణమును కావ్యమును కాని మృదుకథా గ్రంథములను కొందరిచే వ్రాయబడినవి. రాఘవ పాండవీయ మన్న ద్వ్యర్థి కావ్యము ఈ యుగ ప్రారంభముననే భీమకవి యను నతనిచే వ్రాయబడెనట. కాని అది ఏ కారణముననో నష్టమై పోయినది. కల్పనా ప్రధానమై, అలంకారమయమై కవి పాండిత్య శక్తులను ప్రకటించుటకొరకే బయలుదేరిన ప్రబంధ శైలి పురాణ శైలి నుండి స్పష్టమైన భేదమును సంతరించుకొని, ప్రాముఖ్యమును పొందవలెనన్న, పదునారవ శతాబ్దపు విజయ నగర సామ్రాజ్యపు శ్రీకృష్ణదేవరాయల ప్రోత్సాహము దొరకు వరకును కాచుకొని యుండవలసి వచ్చెను. రాయలు కవి పండితాభిమానియును, స్వతః బహుభాషా ప్రవీణుడును, ఆంధ్ర సంస్కృతములలో నుత్తమ కవియును అయియుండినందువలనను, దక్షిణ భారతదేశమున నొక సామ్రాజ్యమును స్థాపించి, శాంతి స్థాపన చేసినందునను, మహోదారుడయి నందువల్లను, ఆతని ఆస్థానమున తెనుగు కవులనేకులు చేరి, పరస్పర స్పర్థతో కావ్య రచన చేయు అవకాశము దొరకినది. పురాణ రచన ఎంత రస వంతమై, హృదయంగమమై యున్నను, స్పర్థామయమైన సన్ని వేశమున అది చప్పగా తోచుట సహజము. అందువలన ఆ కాల మున కావ్యతత్త్వ పరీక్షలో కవి పడిన కష్టము ముఖ్య సాధన మయ్యెను. క్లిష్టమయిన నడకతో, చక్ర, నాగ, మురజేత్యాది బంధముల రూపమున రచించుటయు, నిరోష్ఠ్యము, ఏకాక్షరము, ద్వ్యక్షరము - మున్నగు నియమము లుంచుకొని పద్యము లల్లుటయు, ఒక వృత్తముతో మరియొక వృత్తమును కాని రెండు మూడు వృత్తములను కాని గర్భీకరించి వ్రాయుటయు, క్షణమున కిన్ని పద్యములని ఆశుధారగా కవిత్వము చెప్పుటయు - ఇట్లు బంధ, చిత్ర, గర్భ, ఆశు భేదములతో కవిత్వము చతుర్విధములని ప్రసిద్ధికి వచ్చెను! రాయల ఆస్థానమందగ్రగణ్యుడైన అల్లసాని పెద్దన్న అన్న కవి తన 'మనుచరిత్ర'లో ఇటువంటి రచన నొకటియు చేయక, సరస ముగా వ్రాసియున్నను, తనకి 'చతుర్విధ కవితామతల్లిక' వశమై యుండెనని చెప్పికొని యున్నాడు! ఈ కాలమున పుట్టిన అనేక గ్రంథములలో ప్రతి పద్యమునందును ఏదైన నొక శబ్దార్థ కల్పన యున్న 'వసుచరిత్ర' అన్న ఒక శూద్రకవి కావ్యమును, వెనుక నష్టపడిన రాఘవ పాండవీయమునకు ప్రతిగా సూరన్న అన్న బ్రాహ్మణకవి రచించిన అదే పేరు గల ద్వ్యర్థి కావ్యమును ముందు వచ్చు కవులకు మార్గదర్శకములుగా పరిణమించినవి. అనేకులు తమ గ్రంథములకు 'పిల్ల వసుచరిత్రలు' అన్న పొగడ్త వచ్చిన చాలన్న ఆశతో వ్రాసిరి. రాఘవ పాండవీయమువలె, రెండు, మూడు, తుదకు నాలుగర్థములున్న కావ్యములు బయలు దేరెను! నిరోష్ఠ్యముగ - పఫబభమ అన్న అక్షరములను వదలి- కొన్ని ప్రబంధములు వెలికి వచ్చినవి. ఒకడు అపంచవర్గీయ ముగ, అనగా కకారము మొదలు మకారము వరకు గల ఇరువది యైదు అక్షరములను విడిచిపెట్టి, 'శేషశైలేశ లీల' అన్న కావ్యమును వ్రాసెనట! రసము, భావము, పాత్ర చిత్రణము, ప్రకృతి సౌందర్యానుభవము - ఇత్యాది కావ్య జీవతత్త్వము లన్నియు వెనుకబడి, శబ్దార్థములను నానావిధములుగా నరికి, విరిచి, అల్లి, కుట్టి చేయు క్లిష్టరచన మితిలేక ప్రవహింప ప్రారంభించెను. చిత్ర కవిత్వపు టద్భుత రచనలను చూచి అలసిపోవలయునన్న, అందుకు పదునారవ శతాబ్దము తరువాతి ఆంధ్ర సాహిత్యమున నున్నంత అవకాశము నాకు తెలిసినంత వరకు ఇంకే సాహిత్యమునను లేదు. ఈ రకపు రచనలు అఖండ ముగా పందొమ్మిదవ శతాబ్దపు కడవరకును వచ్చుచుండెను. ఇంకను పూర్తిగా నిలిచిపోయినవని చెప్పుటకు వీలులేదు.

ఇవన్నియును ప్రాయశః గద్యపద్యాత్మకము లగు చంపూ గ్రంధములే. సంస్కృత ఛందస్సులకు సంబంధించిన అక్షర వృత్తములగు చంపకోత్పలేత్యాదులలోను, దేశీయ ఛందము లకు చెందినవైనను, శాస్త్రకారులచేత అంగీకరింపబడిన సీస, గీత, కందములలోను, అపురూపముగా అక్కర మొదలగు పద్యములలోను వ్రాయబడియున్నవి. కేవల పద్య గ్రంథములును అపురూపముగా లభించును. కేవల గద్యమున రచింపబడిన గ్రంథములు పూర్వకాలమున దొరకవు. సుమారు 17వ శతాబ్దము తరువాత కొన్ని తలసూపినవి. కాని వానికి ప్రాముఖ్యము రాలేదు. రావలసినంత యోగ్యతయును వానికి లేదు.

పామర సాహిత్యము :

ఇవన్నియును పండిత సాహిత్య విషయము. పండితుల మెప్పే ప్రధానమై, వారేర్పరచిన వ్యాకరణము, ఛందస్సు, అలంకారము, సంప్రదాయము మున్నగు నియమముల కనుసార ముగా వ్రాయబడియున్నది. ఇటువంటి రచనకు కావలసిన పాండి త్యము లేక, లేక, దీనిని సంపాదించుటకు ఇష్టము లేక యున్న

పామరులైన స్త్రీ శూద్రాదులు కేవల జిహ్వాచాపల్యముతో పరోపదేశము కొరకును, ఆత్మానందమునకును రచించిన సాహిత్యము హెరాళముగ నున్నది. పదునారవ శతాబ్దము తరువాత నలుగురైదుగురు మహిళలు పండిత సాహిత్యమునకు చేయివేసిన వారున్నను, మొత్తముమీద తెలుగులో స్త్రీలు ఈ పామర సాహిత్యమునకే ఎక్కువ సేవ చేసియున్నారు. ఈ సాహిత్యము పండిత సాహిత్యమునకన్నను ప్రాచీనతలో కనీసము తక్కువైనది కాదని చెప్పవచ్చును. కాని ఇది రాజుల ఆశ్రయములో అభివృద్ధి చెందినది కానందువల్ల, శాసనాద్యాధారములు లేనందున, దీని కవుల కాలము క్లుప్తముగా నిర్ణయించుట అసాధ్యమయినది. ఇందులో అనేక కర్తల పేర్లే తెలియవు. పాటల రూపముననున్న రామాయణ భారతాది పురాణములు, ఉపాఖ్యానములు, దేశీయ వీరుల కథలు, యక్షగానములు, భక్తిరస ప్రధానములయిన భజన కీర్తనలు, పెండ్లిపాటలు, జోలపాటలు, అద్వైత తత్త్వములు, అన్నిటికన్న ఎక్కువగా శృంగార రసమయమైన పదములు, జావళులు మున్నగునవి ఈ తరగతికి చెందినవి. వీనిలో కొన్ని నీరసముగను, అసహ్యకరముగను ఉన్నను, ఎక్కువభాగము తీక్ష్ణమగు రసధారతోను, చాటుమాటులేని నేరమగు నడకతోను పాడెడువారి యొక్కయు, వినువారి యొక్కయు హృదయములను భేదించగలవు.

ఈ పండిత పామర సాహిత్యములు రెంటికిని చేరియు చేరకయున్న మధ్య సాహిత్యము సహజముగా అన్ని భాషల యందును ఉండును. పామర జనులు దీనిని సులభముగా గ్రహించి, ఉదార రసభావములను చవిచూడగలుగుట వలన, వారికి దీనిలో భక్తియు, అభిమానమును కలుగును. సామాన్యమైన సాహిత్య నియమములకు లోబడియే యుండుటవల్లను, రసవంతముగా నుండుటవల్లను, మెదడుకు కష్టమునీయక పోయినను, పండితులకు కూడ దీనిని పూర్తిగా తిరస్కరించుటకు సాధ్యము కాదు. భక్తి, శృంగారము, వేదాంతము, నీతి, హాస్యము, లోకానుభవము- ఇత్యాది విషయములను ప్రతిపాదించు శతకములు, ఈ జాతికి చేరదగినవి, లెక్కకు మిక్కిలి కలవు. కన్నడములో సర్వజ్ఞునివలె బహు ప్రసిద్ధుడైన, ప్రాయశః అతనికి సమకాలికుడైన వేమన పద్యము లీ తరహావి. ద్విపదచ్ఛందమున వ్రాయబడిన రామాయణ మహాభారతాది పురాణములు, నలచరిత్ర, హరిశ్చంద్ర చరిత్ర, ఇత్యాది ఉపాఖ్యానములు, ఈ జాతివే. కన్నడములో షట్పదీ కావ్యములవలె ఈ ద్విపద కావ్యములు మొదటినుండియు చాల వ్యాప్తి చెందినవి. కొందరు, "ద్విపదకావ్యమ్ము ముదిలంజ...." ఇత్యాదిగా నిరుపయోగ పదార్థముల జాబితాలో చేర్చి, హేళన చేసిన కూడ, మరికొందరు పండితులే, జన సామాన్యమునకు వీనిపైగల అభిమానమును కనుగొని, ఈ ఛందస్సులో కవిత్వము రచించిరి. ఇదికాక, చంపూ మార్గముననే రచింపబడిన శుకసప్తతి, హంసవింశతి - మొదలగు కథా కావ్యములు ఈ సాహిత్యమునకే చేరవలసినవి. ఇవేకాక, సంస్కృతములో వలె తెనుగులో కూడ అసంఖ్యాకములుగ నుండు 'చాటు పద్యములు' ఈ రకపు సాహిత్యమే అగును. చాటుపద్యములన్న కవులు ప్రస్తావవశముగా తమకు తోచిన విషయముల మీద ఆయా సమయములలో ఆశుధారగానో, ఆలోచించియో, రచించి పాడిన పద్యములు. ఇవి ప్రాయశః నోటినుండి నోటికి - వానికి సంబంధించిన కథలు, వ్రాసినవారి పేర్లు, మున్నగు విషయములతో సహా - అగోచరముగా దిగివచ్చినట్టివి. ఇటీవల 'చాటుపద్య మణిమంజరి', 'చాటుపద్య రత్నాకరము' అను పేర్లతో కొన్నిటిని సంకలనము చేసి, విద్వాంసులు ప్రకటించియున్నారు. కాని వీని నిజమగు సంఖ్య కొన్ని వేలకు తక్కువగా నుండజాలదని ధారాళముగ చెప్పవచ్చును. వీనిలో సకలవిధ భావములు, సకలవిధ రచనలు దొరకును.

ఆంగ్ల సాహిత్యపు సుడిగాలి :

ఇదంతయును ఆంగ్లసాహిత్య వాసనను చూచుటకు మునుపు నడచిన తెనుగు సాహిత్యపు ముఖ్య విషయముల సంగ్రహ సూచన. ఆంగ్ల సాహిత్యపు సర్వవ్యాపియైన స్వరూపమును తెలిసినవారు, ఇటీవల, అనగా పందొమ్మిదవ శతాబ్దపు చివరి భాగమున కిటీవల, ఆ సాహిత్యపు సుడిగాలి వలలో పడి, వెరగు చెందిన దేశభాషా ప్రపంచము ఎన్నెన్ని విధములుగ గునిసి, ఎగిరి, పడి, లేచి, నాట్యము చేయగలదో ఊహించవచ్చును. సకల విధములైన కథలు, నవలలు, నాటకములు, అనుకరణములు, చర్చలు, చరిత్ర — మున్నగు సాహిత్య కార్యములందును

క్రొంగ్రొత్త ప్రయత్నములు కొనసాగుచున్నవి. ప్రాత సంప్రదాయములన్నియు దినే దినే యుక్తాయుక్త వివేచన లేక క్షీణమగుచున్నవి. అట్లే ఆంగ్ల సాహిత్యపు సార్థకమైన, నిరర్థకమైన, అనర్థకమైన సంప్రదాయము లన్నియును వచ్చి నిండుకొనుచున్నవి. పద్యమునకన్న గద్యమున కెక్కువ ప్రాముఖ్యమేర్పడుచున్నందువల్ల, సహజముగా భాష వ్యాకరణ శృంఖలములను సడలించుకొని వ్యావహారిక రూపమునకు దగ్గరగా వచ్చుచున్నది. భాషా సరస్వతికి నూతన నూతనాలంకారములను తయారుచేసి పెట్టవలయునను ఆతురత అన్నిచోటుల యందును మితిమీరుచున్నది.

మొత్తముమీద చూచిన, ఇప్పటి ఆంధ్ర సాహిత్యమున స్వతంత్ర రచన చాల స్వల్పము. స్వాతంత్ర్యబుద్ధి దిన దిన ప్రవర్ధమాన మగుచున్నను, స్వతంత్ర కార్యమింకను నడవలేదు. మన స్వతంత్రబుద్ధి పాశ్చాత్య సంప్రదాయములకు పరతంత్ర మగుటలో ప్రబలమగుచున్నదే కానీ, ప్రపంచ నాగరకతకు మనదే అయిన ఒక నూతనపు కానుకను సమర్పించవలయునను ఆశ కానీ; ప్రజ్ఞలో, ప్రతిభలో, మన మితరులకన్న తక్కువ కాదన్న భరవసా కానీ, ఇంకను మనలో తలయెత్తలేదు. ఇది ప్రస్తుత భరతఖండవాసుల సామాన్యధర్మమై యున్నది. ఇప్పటి తెలుగు సాహిత్యమందును స్పష్టముగా ఈ లక్షణములు కనవచ్చును. ఇక సమర్థులయిన సర్వులను ప్రాయికముగా రాజకీయ రణరంగమున పోరాడుచున్నందువల్ల, ఉత్తమాంధ్ర ప్రతిభాశక్తి యొక్క ప్రచారమున కవకాశము లేక సాహిత్యప్రగతి కూడ వెనుకబడినది. కాని, వారిలో వన్నెలు లేక వట్టి వాతలు పెట్టుకొని, ఇతరులను తృప్తిపరచి, ఆ మూలమున తాము కృతకృత్యులయితిమని నమ్మే లక్షణము దినదినము క్షీణమగుచుండుట శుభసూచన. అందువలన ఆంధ్రభాషలో ఉత్తమ స్వతంత్ర సాహిత్యము ముందున్నదనుటలో సందేహము లేదు. కాని, ఎంత ముందు?

(ఈ వ్యాసము కీ॥శే॥ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు 'విశ్వ కర్నాటక' అను కన్నడ పత్రిక ఉగాది సంచికలో **1931**లో ప్రచురించినది. ఇది కన్నడ దేశపు పాఠకులను దృష్టిలో పెట్టుకొని రచింపబడిన దైనను, తెనుగువారికి కూడ తప్పక ఉపయోగపడగలదని నా ప్రగాఢ విశ్వాసము.)

తెనిగింపు : **శ్రీ శంకరగంటి రంగాచార్యులు**

---

# చైతన్య సస్యం

భావసముద్రంలో మునిగినప్పుడే
తెలిసింది నాకు–
శబ్దాలే నిరంతరాయ శ్వాసకోశాలనీ,
ఊపిరాడని సమస్య లేదనీ;

భావవీథిలో నడచినప్పుడే
తెలిసింది నాకు–
శబ్దాలే గమన ప్రేరకాలనీ,
గమ్యదృష్టి లేని గమనం వ్యర్థమనీ;

భావాంబరంలో ఎగసినప్పుడే
తెలిసింది నాకు–
శబ్దాలే రెక్కల బలమనీ,
విశాల సీమలను దర్శించే సూక్ష్మదృష్టి విశిష్టమనీ;

నాలో 'శబ్దవృష్టి' కురిసినప్పుడు
ఆశ్చర్యపోయాను నేను
అంతకుముందే సస్యమై ఉన్నందుకు

ఇప్పుడు నేను
కఠినతను చీల్చే చైతన్యాంకురాన్ని
వెలుగులను ప్రేమించే పచ్చని చూపుని
దిక్కులను పలకరించే పరిమళ కరచాలనాన్ని
లోని మాధుర్యాంశాలకు రూపం దిద్దే
సుఫల గీతాన్ని

**శ్రీ జి. రామశేషయ్య**

# స్వప్నభంగ

## శ్రీ సోమసుందర్

ఈ సనాతన సాగర తీరంలో తర తరాలుగా హాయిగా
ఆడుకున్నారు శత సహస్రాల బాల బాలికలు....
పిచ్చుక గూళ్ళు నిర్మించుకున్నారు, గవ్వలూ గుల్లలూ ఏరుకున్నారు....

కాని ఈ సాగరం ఎన్ని దురంత కిల్బిషాలు గర్భస్థం చేసుకుందో....
తన సికతాతల తీర వక్త్రంలో ఎన్నెన్ని కళంకాలు గుప్తపరచు
కుందో... శల్యకంటకాలతో తన తనువు అలంకరించుకుందో....

భూతకాల మహాంధకార కర్కోటక కళేబరాలు భద్రపరచుకుందో?....
నోరు తెరిస్తే చాలు ఎన్నెన్ని మహాభయంకర ఉత్పాతాలు సిద్ధపరచు
కుందో— ఏమీ తెలియని అమాయక బాల్యం— ఆగంతుక శైశవ
చాపల్యంతో సాయం వాహ్యాళీ క్రీడల సంతసించింది....

ఇదే నంగనాచి కడలిలో లక్షల తుఫానులు — జీవత్ పరంకోటిని
కబళించి వేశాయి.... బ్రతుకు పచ్చల కిరణాలపై మహావినాశక క్రతు
వులు ప్రయోగించింది. స్వప్నరాశులు నింపుకొని తీరాల నలంకరించిన
నౌకలను తిమింగలాల పరమాయించి ముంచివేయించింది.

చిత్ర తరంగాల మడతలలో ఛిద్రిత జీవ రహస్యాలు....
జడధి కెరటాల ముడతలలో మణిగిపోయిన ఆశాకిరణాలు....
ఘోషోద్ఘాటిత శబ్దజాలంలో నిశ్శబ్ద శోకతరంగాలు....

అగణిత కాలావధీ సంపుటిలో నిర్దయాపూరిత
అచేతనా చేతస్కాలు.... తస్కరిణీ విద్యల కుతంత్రాలు....
కూటనీతులు.... కుచోద్యాలు.... కుహనాదుర్ మోహాలు....

ఇన్ని కుట్రలూ ఎరుగని బాలోల్లాసం కేవల సంభ్రమాశ్చర్యాల
ఆవేశించిన పొంగులతో, పరుగులై ఉరకలై కేరింతలైన
వెర్రి ఆవేశాలతో.... సృష్టిస్తూ తోషవార్నిధుల ఎన్ని యుగాలో?!

ఈ సాగర సమాశ్లిష్ట భూతలంలో ఎన్నెన్ని భూతాల కొలుములు?
ఎన్నెన్ని ఆకర్షణా వికర్షణల పిశాచి పీడల కొలువులు?
ఎన్నెన్ని ఆలాపనా మూర్ఛనలు? ఎన్నెన్ని ఆరోపణా కృపాణాల కొలనులు?

## స్వప్న భంగ

ఇంత మనోమోహన ప్రదర్శనంతో ఈ సాగర వేల
ఎంత కపటి? ఎంత కృపణి? ఇంకా సంశయమా?
ఇది దయ్యాలు పొరలాడే వేల? ఇది కయ్యాల రక్కసి
సమూహాల భయంకర విన్యాసాల హేల! మృత్యు హస్తాలు
విసరిన మాయా వాగురలు కూడియాడిన నెత్తుటి లోయ....

నీలితారలు జాలిగా రాలిపడిన పొలాలు... పచ్చని పంట
పొలాలపై విషాగ్ని జ్వాలాభారం పొరలిన దుర్ముహూర్తంలో
నిష్కారణంగా ముక్కలు ముక్కలై పోయిన శాంతిదేవత ఆలయం!
ధ్వంస ధూళి ప్రివిలి త్రుళ్ళిపడిన భయంకర సమయంలో—
బేలగా కళ్ళు నింగికి నిగిడిస్తూ ఇదే సాగరం—
మెట్ట వేదాంతాలు వల్లించింది! తన జలకాలను తన
చిచ్చు గుండెల జల్లెడతో నిష్పూచీగా జల్లించింది...

మృత్పిండాలతో పచ్చి మంటలు గోంద్రించినపుడు
జల కాలువల పొంగులలో విషహాసాలు బుసబుస లాడినపుడు
ఈ తీర భూములలో క్రూర సర్పాలవంటి మారణాయుధాలు....
పడగలు విప్పి దొంగాటకాలాడినపుడు.... మిత్తిగొంతెత్తి పాడినపుడు...
అన్నీ తెలిసిన ఈ సనాతన సాగరం కిమన్నాస్తి!
మూతి బిడాయించింది గుప్‌చుప్‌గా!?
ఇంకా క్షమించగలమా ఈ మృషారూపిణి జలధిని?

ఇంతెందుకు? — ఈ సాగరతీరంలోని గుప్పెడు ఇసుక
తీసుకొని పరిశీలించు! ఎన్నెన్ని హత్యలు బయటపడగలవో!
ఎన్నెన్ని నరమేధ యాగాలు గతగాథలు విన్నవిస్తాయో—
ఎన్నెన్ని భ్రూణ హత్యల శోకోదంతాలు వెల్లడి కాగలవో!!

అణువణువునా దాగిన ఆర్తారవాలు.... మౌన కంఠార్భటుల
దారుణ మారణహోమాలు నీకే వినిపిస్తాయి పరీక్షించు!
గతానేక శోకానుభూతులు నీ పెదవులపై క్షీర రాసులు
నింపుతాయి. ధూళిలో కలిసిపోయిన దరహాసాలు—
ఆకాశ శూన్యాటవుల ప్రగాఢ యవనికల మాటులనుంచి
తొంగి తొంగి చూస్తాయి! వృథాశ్రువులు కురుస్తాయి!

అవునవును కిదలి కన్నీటి ఉప్పెనల కాణాచి!
బహురూపిగా భ్రమలు కలిగించే బాణామతి!



శ్రీ పాతూరి రఘురామయ్య

# మాదిరాజు రంగారావు కావ్యాలు- ఒక విశ్లేషణ

'మతాల విచ్చుకత్తుల మెరపులలో
బ్రతుకును వెలిగించలేను
ఇజాల చిక్కుటుచ్చులలో
బ్రతుకును బంధించలేను'

అంటూ విశిష్ట పంథాలో మానవీయాభ్యుదయ కావ్యాలను చిస్తున్న ఆధునిక కవి మాదిరాజు రంగారావు. 1955 లోనే రు 'కిర్మీరం' అన్న కావ్యాన్ని ప్రచురించి (శ్రీ ఉరుపుటూరి ఘవాచార్యులుగారి సహకారంతో) మహాకవి శ్రీశ్రీకి అంకిత చ్చినారు. మహాప్రస్థానం కావ్యం మాదిరాజుపై చెరగని ముద్ర వేసింది.

కుందుర్తిలోని ప్రయోజన దృక్పథమూ, శ్రీశ్రీ లోని విప్లవ భావసంపత్తీ, తిలక్‌లోని మానవీయ భావనాత్మక అంతర్ముఖీన లక్షణమూ - ఈ మూడు అంశములు మాదిరాజు కవిత్వంలో స్ఫుటంగా కనిపిస్తాయి. ఇవేకాకుండా శిల్పం రీత్యా కళామయత కవిత్వమంతటా పరచుకొనీ, ప్రజాస్వామ్య సమ సమాజ భావం అన్ని కావ్యాల్లో నిక్షిప్తమయి పై ముగ్గురినుండీ ఈ కవిని ప్రత్యేకంగా నిలబెట్టినవి. ఏ పక్షానికీ చెందని కవిగా మాదిరాజు సుప్రసిద్ధుడు. వారిది మానవీయ భావమార్గము. సకల వర్గాలూ శ్రేయోదాయకంగా పరిణమించాలని వర్థిల్లాలనీ ఆకాంక్షించే వీరి కవిత్వంలో సమస్త మానవ జీవనరీతులు ప్రతిఫలించాయి.

అధర్మ నిధనానికీ, ధర్మపథ విజయానికి ప్రతీకలుగా చెప్పుకోబడుతున్న పండుగ సమయాల్లోనే వారి కవితా సంపుటాలు వెలుగులోకి వచ్చాయి. శుభప్రద భావనకు సంతోషకర కవితా సమయాలకూ ఆకరమయిన సంపుటాలుగా రాణించడమే ఇందుకు కారణం. ప్రతి కావ్యంలోనూ ముగింపు శుభప్రద, సంతోషకర, ఆహ్లాద భావననే కలిగి ఉండటం సహజమే.

విజయదశమి సందర్భంగా—

1. ముక్తకాలు-ఉష ఆగమనం (సాహితీబృంద ప్రచురణ-1970)
2. ఆవాహన (రసధుని ప్రచురణ-1973)
3. నాలో ప్రవహిస్తోంది నది (సాహితీ సమితి ప్రచురణ-1985)
4. అగ్నిమయం జీవితం (రసధుని ప్రచురణ-1988)

ఈ నాలుగు కావ్యాలూ అచ్చయి వెలుగులోకి వచ్చాయి. ఇందులో ముక్తకాలు-ఉష ఆగమనం రెండు కావ్యాలు ఒకే పుస్తకంలో చేకూర్చబడినాయి. ముక్తకాలు నాలుగు పాదాలు నాలుగు పాదాలు గల మినీ కవితలు. ఇందులోని భావం ఎంత తీవ్రమో అభివ్యక్తి అంత సరళం. పూర్వకాలంలో శతకం ఎంత శక్తివంతమో వచనకవితా యుగంలో ముక్తకం అంతే శక్తిమంతము. ఇక 'ఉష ఆగమనం' అన్నది నవ్య కవితావిర్భావానికి సంకేతం. అభ్యుదయ కవిత్వ చరిత్రలో ప్రజాస్వామ్య సమసమాజం లక్ష్యంగా సాగుతున్న మానవీయ కవిత్వమే ఉష. అభ్యుదయ నవ్య కవిత్వం కూడా దీనికి అర్థంగా చెప్పుకొనవచ్చును.

సామాన్యుడి గుండెలో గూడుకట్టి
బిగిసిన హిమ శ్రేణులవలె బాధలు
సామాన్యుని బ్రతుకులో ఎదురై
మారిన మరుభూములవలె ఆశలు.

బాధల్నీ ఆశల్నీ మానవ ఇతిహాస సారభూతమైన తత్త్వంతో ముడిపడిన సాధారణ శైలితోనే వ్యక్తీకరించినారు.

కాలగర్భంలో కలసిపోయే మానవుడు
కాల ముఖంలో వెలసిన వర్ణరేఖ
బహువర్ణ విచిత్ర రేఖావలయం ప్రపంచం
ప్రతిక్షణం మార్పులతో వర్తించు చిత్రరంగం.

ఇట్లా ఒక ముక్తకానికీ మరో ముక్తకానికి అభివ్యక్తిలో పోలిక ఉన్నా, అన్నిటికీ ఛందోబద్ధత అన్నది మాత్రం ఏదీ లేదు (ఒక్క పాదసంఖ్యా నియమం తప్ప). ఇందులో చెప్పుకో దగ్గ విశేషమేమంటే రెండు రెండు పాదాలు ఒక్కొక్క భావ గణంగా ఎక్కువ శాతం ముక్తకాలు తీర్చబడ్డాయి. కొన్ని ముక్తకాలు నాలుగు పాదాలూ నాలుగు భావగణాలుగా తీర్చబడ్డాయి.

ఉషాగమనంలో సంస్కృత పదబాహుళ్యం ఉంది. అయితే తత్సమాలూ తద్భవాలే గనక పఠితకు ఆనందం చేకూర్చే అవకాశం లేకపోలేదు. సంస్కృత సాహిత్యంతో వీరికి గాఢ పరిచయం ఉండడం మూలంగా పూర్వ గ్రంథాల పరిజ్ఞానమూ ఎక్కువే గనక ఒక్కింత చిక్కదనంతో కూడిన పదప్రయోగ విధానం చోటు చేసుకుంది. సాధారణ పాఠకుడు కూడా చిత్త శుద్ధితో ప్రయత్నిస్తే అందుకునేంత చిక్కగానే ఉంది రచనా పాటవం. ఇందులో ఎనిమిది ఖండికలున్నవి. ఇందులోని ఎనిమిదో ఖండిక 'ముక్తకాలు' అన్న పేరునే కలిగి ఉంది. ఇది మినీ కవితలతోనే కూడుకొన్న ఖండిక.

ఆవాహన సంపుటిలో నాలుగు ప్రధాన భాగములు- ఒకటి. విప్లవ ఛాయల్లో వియత్నాం. ఇందులో వియత్నాం యుద్ధం సందర్భంగా రాసిన గీతాలున్నవి. మానవునిలో నిగూఢంగా ఉన్న జంతు మనస్తత్వమునూ అనాగరక లక్షణమునూ చిత్రించినారు. ఉత్తర వియత్నాం సంఘటనలూ, యుద్ధ విరమణా, విప్లవవీరుని కన్నుల్లో ఆశా కాంతిరేఖ స్వరూపము ప్రదర్శింపబడినవి.

రెండో భాగం రేఖాచిత్రాలు. ఈ కవి ఇందులో ఉన్న ఖండికల్లో అర్థాన్ని అధ్వాన్నపు అడవిలో వదిలేయలేదు. చిన్న చిన్న గుల్మముల మధ్య తుప్పల మధ్య మేపుతున్నాడు. రచనలో ప్రయోగ పద్ధతి పాటిస్తూ కూడా ప్రయోజనాన్ని ఆలోచననూ అనుభూతినీ అనుసరిస్తూనే వచ్చారు. చమత్కారాన్ని బాగా పోషించారు. దుంపదెగ, తస్సాదియ్యా, తుపాకి వంటి మనస్సు, కాగితపు పంటి ఊహ, అర్జంటు పని, ముక్కాలి పీట, ఫూల్, అతగాడు, హంతకుడు, పులులు సింహాలు, వెలుగు మంటల బొమ్మలు, జీరో బల్బు, చీమ కళ్ళు, పికాసో బొమ్మ, ఊడిపడు లాంటి పదాలూ పదబంధాలు వైచిత్రిని చేకూర్చడంలో తోడ్ప డ్డాయి. చిత్రాలంటే చిత్రాలే. బొమ్మల్లాగే రకరకాల రూపాలతో. అధివాస్తవిక ఉద్యమం కూడా తొలుత చిత్రకళా రంగంలోనే పుట్టింది కదా? అందుకే చిత్రకళకూ జీవితానికీ మధ్య ఉన్న అవినాభావ సంబంధాన్ని ఇందులో ప్రదర్శించటం జరిగింది.

మినీ కవితలు మూడో భాగం. ఇందులో ఆధునిక యుగ చైతన్య పరమైన మంచీ చెడుల వివేచన నిబిడీకృతమై ఉంది. సంఖ్యకు నూరు ఉన్నాయి. కానీ ఇందులో భావాలు అంతకంటె ఎక్కువే. కవి లోకద్రష్ట. కవితా స్రష్ట. 'నేను సముద్రాన్ని నీవు కాలిడలేవు, నేను ఆకాశాన్ని నీవు అందుకోలేవు' మానవుని అంతరంగ ప్రక్షాళనంతో మరో మనోలోకం నిర్మింపజేసే ఉత్తమ సంకల్పం ఈ మినీ కవితల్లో అడుగడుగునా స్పష్టంగా ఉంది.

నాలుగో భాగం అమృత లిప్తలు. ఇందులో అనుభూతి ప్రదంగా ఉన్నత భావనా సంచారం కానవస్తుంది.

> నా కళ్ళు వదలాయి కళలు
> నా చూపు చిమ్ముతోంది వెలుగు
> నా చిత్తం సరిస్తోంది చైతన్యం
> నా హృది స్పందిస్తోంది సంగీతం

ఊహ, ఆశ, రాగం, వ్యధ, కోర్కె, ఆత్మ, మనసు, అంతరాత్మ, శక్తి, తేజస్సు, ఉద్రేకం, అనుభవ కళ, తలపులు, ఆలోచన ఇత్యాది విషయాలను కవితామయం కావిస్తూ జగత్తులో ప్రకృతికీ, మానవునికీ మధ్య గల సంబంధాన్ని స్పష్టంగా వ్యక్తీకరిస్తూ - మానవ జీవితాదర్శాన్ని ప్రచలితం చేశాడు.

'నాలో ప్రవహిస్తోంది నది' అనుభవం, ఆలోచన సంస్కారం ప్రగతి భావనా సహితంగా సాగిన మానవతా పూర్ణ నవ్యకావ్యం. అనేక భౌతిక మానసిక స్థితులకు దర్పణం పట్టినట్లు కళామయాభివ్యక్తితో వ్యక్తికీ, సమాజానికీ మధ్యనున్న సంబం ధాన్ని బహుముఖీన పరివ్యాప్త సామాజిక పార్శ్వాలనూ ప్రతి బింబిస్తున్నది. నాలో ప్రవహిస్తోంది నది అన్న మకుటాన్ని అనుసరిస్తూ ఐదు పాదాలు ప్రతి ఖండికలోనూ ఉంటాయి. అంటే ఇందులోని ఖండికలు షట్పదులు (ఆరు పాదాలతో కూడినవి).

> నాలో ప్రవహిస్తోంది నది
> ముక్కలు ముక్కలైన దేశాలను కలుపుతూ
> ఎక్కడి కక్కడ అడ్డుగా ఉన్న పొలిమేరల్ని చెరపుతూ
> మానవతా మధురజలంతో స్నేహమయం చేస్తూ
> స్వేచ్ఛ స్పందించే ఉత్సాహ తరంగాలతో
> నాలో ప్రవహిస్తోంది సమష్టి చైతన్యంతో

'మానవుడే నా సందేశం' అన్న శ్రీశ్రీ భావన మాదిరాజులోనూ నిక్షిప్తమైంది.

'అగ్నిమయం జీవితం' పంజాబ్‌లోని హింసావాదాన్ని ఖండిస్తూ, ఆఫ్రికాలోని శ్వేతజాతి పాలనలో ప్రమగ్గుతున్న ఆఫ్రికన్‌ల పోరాటదీప్తినీ వర్ణించిన కావ్యం. ఇందులో 'నిశ్శబ్ద గవాక్షం నుండి' అన్న సుదీర్ఘ ఖండిక జాతీయ అంతర్జాతీయ రంగాల్లో నెలకొన్న హింసను వివరిస్తూ, యుద్ధాలతో నలిగే మానవుని ఆలోచనలను చిత్రిస్తూ, మానసికంగా మానవుడు సాధించవలసిన ఔన్నత్యం గురించి ఆవేదన చెందాడు. కఠిన జీవిత వాస్తవాలను చిత్రించడం జరిగింది. ఇందులో 'ఏ బ్రతుకిక్కి ఆ బ్రతుకు' అన్న లేఖా కవిత ఒకటి ఉంది. ఈ లేఖా కవితలో కవిత్వాన్ని నిర్వచిస్తూ ఈ విధంగా రాశారు-

'జగత్తు నుండి ఎదురయ్యే ప్రశ్నలకు
మనస్సు శబ్దరూపంలో ఇచ్చే
అందమైన సమాధానమే కవిత్వం'.

ఆధునికుల్లో కొందరికి ఇందులోని 'మనస్సు' 'అందమైన' పదాలు రుచించవు. వారి దారి వారిది.

సంక్రాంతి సందర్భంగా—

1. యుగ సంకేతం (సాహితీ బంధు బృందం - 1970)
2. పడగెత్తిన ఉదయం (రసధుని - 1973)
3. ఆనందధుని (సాహితీ బంధు బృందం - 1975)
4. కాలాన్ని నిలిపే క్షణం (రసధుని - 1979)

ఈ నాలుగు సంపుటాలూ ఆవిష్కృతమైనవి. ఆనందధుని కావ్యం శ్రీ అరవిందుల తత్త్వచింతనను కవిత్వీకరించింది.

యుగ సంకేతం సంపుటిలో రెండు కావ్యాలున్నవి. ఒకటి యుగ సంకేతం. రెండోది మేల్కొన్న ఆకాశం. కవిత్వాన్నెపుడూ వాచ్యం చెయ్యని భావుక హృదయంతో లక్షణ, వ్యంజన, అభిద మొదలయిన శబ్ద శక్తులను బాగా పోషించిన కవుల్లో మాదిరాజు ఒకరు. ముఖ్యంగా ఆధునికుల్లో కవుల మనుకుంటున్న వాళ్ళలో ఎంతమందికి ఈ శబ్దశక్తి రహస్యం అవగతమైందో ఏమోకానీ మాదిరాజుగారికి మాత్రం శబ్దశక్తి రహస్యం క్షుణ్ణంగా తెలుసు. ప్రతీకలూ, పదచిత్రాలూ, భావరూపాలు ఎంతగా వాడినా అస్పష్టతకు మాత్రం చోటివ్వరు. చోటు నివ్వడాన్ని అంగీకరించరు. మననశీలం ఎక్కువ గల పాఠకుడు వీరి కవితను ఆస్వాదించగలడు. మేల్కొన్న ఆకాశం హేతువాద భావ విజృంభణాన్ని ప్రతిఫలిస్తున్న కావ్యం. యుగ సంకేతం అభ్యుదయ కావ్యరాజము.

పడగెత్తిన ఉదయం అన్న కావ్యంలో ఉదయం నుండి మొదలుకొని మళ్ళీ ఉదయ మయ్యేదాకా (ఇరవై నాలుగు గంటల్లో) సామాజికుని అనుభవాలను ప్రతిబింబించే కావ్యం. ఇందులో బాహిర ప్రపంచ వలయం నుండి అంతరంగ వలయం లోకి దృష్టి సారించిన మానవునిపై దృష్టి కేంద్రీకరింపబడింది.

ఆనందధునిలో శ్రీ అరవిందుల మహాకావ్యం సావిత్రి వల్ల కవిలో కలిగిన అనుభవ పరంపర వ్యక్తీకరింపబడింది. ఇందులో మానసిక తత్త్వవివేచనా, ప్రాగ్రూప దృష్టీ కలెగలుపుగా ఉన్నవి.

'ఈ మనోజ్ఞ జ్వాలారూపం
అఖిల మానవాత్మకు సంకేతం'

అంటూ ఉన్న కవి సార్వత్రిక భావనకే ప్రాధాన్యమిస్తున్నారు. వైయక్తికానుభూతి ఆధారంగా సార్వత్రిక పద్ధతిలో రచన ప్రత్యేక వెలుగు సంతరించుకున్నది. 'దైవాభిముఖంగా సాగే పథంలోని మానసికమైన సుందర శిల్పాలే దేవతలు' అంటూ మానవుడు కల్పించుకున్న అనేక దివ్యరూపాలను నిర్వచించాడు. ఆత్మ, అంతఃకరణ, మనస్సు - ఈ మూడు మూడు విభాగాలుగా కావ్యంలో తీర్చబడినాయి.

'కాలాన్ని నిలిపే క్షణం' అనుభూతిప్రద అభ్యుదయ కావ్యం ఆధునిక మానవునిలో చోటు చేసుకుంటున్న చైతన్యం గూర్చి కళామయ అభివ్యక్తితో కూడిన స్పష్టీకరణ లున్నవి. మానవీయ భావం, అనుభవ కళా వ్యాఖ్యానం, అభ్యుదయ భావ రేఖల సంపుటి ఈ కావ్యం. చరిత్రనూ, ప్రకృతినీ, మనిషినీ సంపూర్ణంగా కవిత్వీకరించే ప్రయత్నం ఇందులో తీవ్రంగా చోటు చేసుకుంది. ఆర్తినుండి ఆనందానికి మనిషి ప్రయాణం సాగించాలనీ, మానవ సంస్కృతీ రూపం రసధుని వలె ఏర్పడాలనీ ఆశిస్తున్న కవి - శిలలూ, హిమాకృతులూ (జడబుద్ధులూ, అజ్ఞానులూ) చైతన్యంతో నిండి మార్పునొందాలనీ భావిస్తున్నాడు.

# జననం
## లేక
# మరణం

## ఇది మీ కుటుంబంలో సంభవించినప్పుడు మీ స్థానిక రిజిస్ట్రారుతో తప్పక రిజిస్టరు చేయండి

ఇది మీకు చాలా సహాయకారి కాగలదు

| జనన ప్రమాణపత్రం<br>వయస్సుకు నిదర్శనం | మరణ ప్రమాణపత్రం<br>వీటికి అవసరం |
|---|---|
| ● స్కూలులో ప్రవేశానికి<br>● ఉద్యోగం సంపాదించుకోవటానికి<br>● ఓటు హక్కును వినియోగించుకోవటానికి<br>● డ్రైవింగు లైసెన్సును పొందటానికి<br>● పాస్‌పోర్టును పొందటానికి<br>● జీవిత భీమా పాలిసీని తీసుకోవటానికి | ● ఆస్తిని వారసత్వంగా పొందటానికి<br>● జీవిత భీమా ధనాన్ని పొందటానికి<br>● ఆస్తి సంబంధిత సమస్యల పరిష్కారానికి |

## సకాలంలో రిజిస్టరు చేసి ప్రమాణపత్రాన్ని ఉచితంగా పొందండి

చట్ట ప్రకారం జనన, మరణాలను రిజిస్టరు చేయటం తప్పనిసరి.

ఆలస్యంగా రిజిస్టరు చేయటానికి కూడా అనుమతి లభిస్తుంది.



**రిజిస్ట్రారు జనరల్, ఇండియా**

davp 89/490

ఉగాది సందర్భంగా—

1. వయొలిన్‌పై రాగంతో (రసధుని) 1972
2. ముక్తధాత్రి (రసధుని) 1972
3. వెలుగులో ఈ నేలపై (సాహితీ బంధు బృందం) 1974
4. మేల్కొన్న ఈ సమయం (సాహితీ బంధు బృందం) 1975
5. నాకు జ్ఞాపకం ఉంది (రసధుని) 1987
6. ఈ తరం స్వరచిత్రం (రసధుని) 1986
7. కిర్మీరం జీవన బింబం (సాహితీ సమితి) 1989

ఈ ఏడు సంపుటములూ ఆవిష్కృతమై సహృదయ పాఠక లోకమును మిగుల రంజింపజేసినవి.

'వయొలిన్ పై రాగంతో' అన్న కావ్యంలో వియత్నాం యుద్ధ పరిస్థితి చిత్రితమైంది. వియత్నాంలో అమెరికా దౌష్ట్యాన్ని ఖండిస్తూ మానవ జీవనంలో శాంతిని కాంక్షిస్తూ వ్రాసిన కావ్యం. హింసావాదం ఒక ఆపరేషన్ పద్ధతివలె పనిచేస్తే మంచిదేనని అభిప్రాయపడ్డారు.

ముక్తధాత్రిలో బంగ్లాదేశ్ విముక్తికి సంబంధించిన కావ్యం. ఇది సంపూర్ణంగా చారిత్రక కావ్యంగా పరిగణించ వచ్చును. ఆయా స్థితుల చిత్రణంలో విశిష్టమైన పద్ధతిని అవలంబించడం జరిగింది.

'వెలుగులో ఈ నేలపై' అన్న కావ్యం స్వాతంత్ర్య రజతోత్సవ కాలానంతరం 1974లో ఆవిష్కృతమైంది. ఇరవై అయిదు సంవత్సరాల కాలాన్ని బిందువుగా గ్రహించి నాటికి ఉన్న వివిధ వర్తమాన స్థితుల్ని అవలోకిస్తూ, భవిష్యదాశ ఉజ్జ్వల రూపాన్ని సూచిస్తూ, జాతీయ దృక్పథ సహితంగా ప్రజాస్వామ్యభావనా దిశగా విశ్వజనీన దృష్టివైపు కవి దృష్టి సారించినట్లు గోచరిస్తున్నది. ఆనాటికీ నేటికీ చెలరేగుతున్న హింసావాదాన్ని ద్వేషిస్తూ—

'హింసతో ఊపిరి తీసుకోదు
స్వాతంత్ర్యం!
రక్తంతో సౌభాగ్యం
వల్లవించదు
జనతా కేదారం
కత్తి అవసరమే
మేరలు మీరితే
ఉత్తరిస్తుంది అదే
ఎత్తైన నీ తలనే'

-అంటూ ఈ విధంగా వ్రాశారు. శ్మశానంలో వచ్చని జీవితం నిజం కాదనీ ఉద్ఘాటించారు.

'మేల్కొన్న ఈ సమయం' అన్న కావ్యంలో యుద్ధ వ్యతిరేకతా, శాంతికామనతోబాటు స్వాతంత్ర్య సమభావములూ చిత్రింపబడినవి. అభివ్యక్తి నవ్యత భావనవ్యత ఇందులోని విశేషాంశములు. ఈ కావ్యం శ్రీ శ్రీకి అంకితమిచ్చారు.

'నాకు జ్ఞాపకం ఉంది' అన్న కావ్యం నిర్మాణ శిల్పంతో క్రొత్త రీతిని కలిగిఉన్న కావ్యం. తొమ్మిది పాదాలు కల ఖండికలతో కూడివుంటుందీ కావ్యం. ప్రతి పుటలోనూ మూడు ఖండికలుంటాయి. ప్రతి ఖండిక మొదటి పాదంలో 'నాకు జ్ఞాపకం ఉంది' అన్న మకుటం ఉంటుంది. ప్రపంచంలోని దీన జనుల, శ్రామికుల, పారిశ్రామికుల - వారూ వీరూ అనేమిటి సకల వర్గాల మనస్తత్వాన్ని ఒక్కొక్క సంఘటన తీసుకొని బొమ్మ కట్టినట్లుగా భావ రూపాలతో సకల స్థితులనూ చిత్రించటం ఇందులోని విశేషం.

నాకు జ్ఞాపకం ఉంది
ఎక్కడ మానవతను జ్వాలలు ముట్టినా
నన్ను రగుల్కొని దహిస్తున్నట్లుంటుంది
ఎప్పుడు ఆత్మబింబాన్ని నీడలు క్రమ్మినా
నన్ను చుట్టుముట్టి పీడిస్తున్నట్లుంటుంది!....

-అంటున్న కవి మానవునిలోని ఆటవిక మృగకౌర్య స్వభావాన్ని సరైన అంచనా వేస్తూ అందుకు చింతిస్తున్నాడు. మరో ప్రపంచ నిర్మితి కోసం ఎంత వేదనను మానవులు అనుభవిస్తున్నారో, మరో మనోలోక నిర్మితికోసం కూడా అంతే తపించాలనీ - అంతరంగంలో మార్పు లేకుండా బాహిర ప్రపంచ పరిణామం సుఖదం కాదనీ మాదిరాజు ప్రకటిస్తూ ఉన్నాడు.

ఈ తరం స్వరచిత్రంలో విడివిడిగా ఉన్న ఖండికలు పదహారు. ఇవికాక రెండు కావ్యాలున్నవి ఇందులో. ఒకటి

స్పందనలో సృజనతో, రెండవది ఈ తరం స్వరచిత్రం - అంటే దాదాపు ఇది మూడు కావ్యాల సంపుటిగా భావించే వీలుంది. వర్తమానంలో క్రియాశీలియైన మానవుని నిరంతర ప్రయాణం లోని వివిధ స్థితుల్ని, భవిష్యదాశా స్వరూపాన్ని అనేక ప్రతీక లతో చిత్రించడం ఇందులోని ప్రత్యేక అంశం.

రారానీ రవి హర్షం
మానవతా కిరణంతో
మనుషుల్లో చిరునవ్వుతో
స్వేచ్ఛా సమసమాజమై.

అంటూ స్వేచ్ఛా సమ సమాజం అనడంలో ప్రజాస్వామిక లక్షణం కలిగిన సమ సమాజాన్ని కాంక్షించినాడు.

మారణాయుధ కళ్ళలో నీరు సోనలై పరించే క్షణాన్నీ, బాంబు గుండెలో వచ్చనౌ శాంతి పంట కన్పడే రోజునూ భావిస్తున్న కవి మానవుని అస్తిత్వం ప్రధానంగా, స్వేచ్ఛా జీవనం ప్రముఖంగా, అతని పురోగతి లక్ష్యంగా కావ్యరచన సాగించినారు.

రానీ ఉదయం ఆనందకేతనమై
విషాదం నుండి విప్లవం నుండి
ఉత్ప్లవించనీ ఉత్సాహలహరియై
కొత్తయుగంలోకి సంస్కార తేజం.

సంస్కారతేజం ఆవశ్యకత ఎంత ఉందో, సమాజ పరిణామం ఎంత సహజమో, మరో ప్రపంచ నిర్మితి ఎంతటి శుభప్రద మైనదో - ఈ కవిత ద్వారా మనకు అవగతమౌతున్నది. 'చరిత్ర సృజించిన తేజం' అన్న ఖండిక శ్రీమతి ఇందిరాగాంధీ అస్తమయాన్ని గురించి వ్రాసినది. ఇందులో ఆమె బ్రతుకు ఔన్నత్యం గూర్చి—

'క్షణం సందు లేకుండా నిండి
గత స్మృతులతో వెలుగై నిల్చింది
జాతి విలువలకూ ఉన్నతికీ సంకేతమై
మిగిలింది హిమ సుషమా శిఖరమై'

-అంటూ ప్రశంసిస్తూ, హంతకులను 'క్షుద్రజగతి వ్యూహంలో కదలే పావులు'గా అభివర్ణించారు.

కిర్మీరం జీవనబింబం పది భాగాలుగా సాగిన కావ్యం. ప్రతి భాగంలోనూ ఆరు పాదాలతో కూడిన ఖండిక లున్నవి. ఆధునిక యుగంలోని మానవుడు ఎదుర్కొనే సకల స్థితుల్నీ బింబిస్తున్నదీ కావ్యం. వాస్తవతలంపై ఎదురయ్యే వివిధ స్థితులూ చిత్రితమైనవి. ప్రతీకలూ, భావరూపాలూ ఇందులో విశేషంగా ఉపయుక్తమైనవి.

రాత్రి చుక్కలై పగలు యంత్ర సమూహమై
వీథి వీథినా వదన బింబ ప్రవాహమై
విజయ భావస్థితులతో గతులతో
అరుణ నీలప్రభలతో దిశలతో
జన జీవనబింబం నా రూపం
వివిధాశయ గాథా కిర్మీరం

అన్న కవి కవిత్వం ఏ నిర్వచనానికీ చిక్కని విధంగా విశాల భావనామహితమై ఉజ్జ్వలంగా ఉంది.

రిపబ్లిక్ డే (26 జనవరి) సందర్భంగా 1976లో 'శబ్దమై ప్రాణమై' అన్న కావ్యం ఆవిష్కృతమైంది. ఇందులో వాస్తవాదర్శాల సమష్టిరూపమైన ప్రపంచం చిత్రితమైనది. మానవుని ఆశాప్రవర్తన, పురోగమన భావన, శాంతి లక్ష్యమూ వ్యక్తీకరింపబడినవి. భౌతికాభివృద్ధి ఎంత అవసరమో మనో వికాసమూ అంతే ఆవశ్యకమని భావించారు. ఈ సంపుటిలోనే వియత్నాం శాంతి కవితలు కూడా ఉన్నాయి. ముజీబ్ అస్తమయం అతని త్యాగమూ ప్రతిఫలించినవి ఈ ఖండికల్లో. చారిత్రక ప్రాధాన్యం ఈ ఖండికలలో ఎక్కువగా కనిపిస్తున్నది.

ఒక్క 'మానవీయం' కావ్యం మాత్రం ఈ ఆవిష్కార ణాత్మక విశ్లేషణకు అతీతంగా ఉత్సవం లేనివేళ జూన్ 1971లో ఆవిష్కృతమైంది.

పండుగ వేళలోనే ఆవిష్కరించుటకు కారణము ఆనంద భావనయే. ప్రపంచం ఎన్ని సమస్యలతో నున్నను మానవుడు ఆనంద భావనకే ప్రాధాన్యము నిచ్చుచున్నాడు. శుభప్రద భావనా, తరంగాలకు సంకేతాలు ఉత్సవాలు. మాదిరాజు కావ్యాలూ ఇట్టి శుభప్రదమైన, ఆనందభావనా విలసితమై యున్నవి. అందుకే వారి కావ్యాలు రసధునులు. నవరసధునులు.

[అభ్యుదయ కవిత్వానంతర ధోరణులపై సెమినార్ నిర్వహించిన డా॥ పేర్వారం జగన్నాథంగారు ఈ వ్యాస రచనలో పరోక్షంగా సహాయం చేశారు. వారికి నా కృతజ్ఞతలు.]

## నిమిత్తమాత్రుడు

నేను నిమిత్తమాత్రుడ ననుకొనుటలో
న్యూనత్వం కన్పిస్తున్నా—
దేనికీ బాధ్యుణ్ణి కాదనే నిశ్చింత వల్ల
ప్రాణం కుదుటపడ్తుంది.

కానీ
జనావళి దీన్ని పలాయనవాదమని తిడ్తుంది!

## అది ధరించని రూపం లేదు

చేతికందని చిత్రమైన పదార్థాల్లో
నేటికీ విలక్షణమైనది, మనసే!

అదొక పసిఫిక్ మహాసముద్రం
అదొక విసువియస్ అగ్నిపర్వతం.

అది కస్సుమంటే—
కాలనాగు బుస్సుమన్నట్లుంటుంది.

అది 'ఖుషీ'గా వుంటే—
కొండవాగు పరుగుల సంగీతం.

ఒక్కొక్కప్పుడది—
పురి విప్పిన మయూరి నృత్యం.

ఒక్కొక్కప్పుడది—
ప్రళయరుద్రుని ప్రచండ నృత్తం.

అదెప్పుడు—
నింగికెగురుతుందో రెపరెపలాడుతూ శాంతికపోతంలా.

అదెప్పుడు—
నేలరాలుతుందో రెక్కలు తెగిన జటాయువులా!

అది ధరించని రూపం లేదు.
అది భరించని తాపం లేదు.

అదేమైనా ఎప్పుడూ ఒకేలా మాత్రం వుండదు.
అదొక అఖాతం: అదెప్పుడూ నిండదు.

—మహబూబ్ కమల్

## (వా)నర గీతం

చెట్టు చూస్తుంది
పర్ణాల ఆర్ద్రనయనాంచలాల- లోనుండి!
చెట్టు మాట్లాడుతుంది
వర్ణాల పరిమళ పూగుచ్ఛాలతో నిండి!
చెట్టు పిలుస్తుంది, పలకరిస్తుంది
చలిస్తుంది, జ్వలిస్తుంది
ఆదరిస్తుంది, ఆహ్వానిస్తుంది
అనంతశాఖా హస్తాలతో ప్రేమగా నిమిరి
నును వెచ్చని నీడలు పరుస్తుంది
సేద దీర్చుకోమంటుంది!
మృదు చిగుళ్ళ పొత్తిళ్ళలో నిన్ను లాలిస్తుంది
మధురఫలాలు నీ కందిస్తుంది
జీవన భయోద్విగ్న క్షణాల నుండి మైమరపిస్తుంది
సుడిగాలినీ.... ఝడివాననూ మౌనంగా భరిస్తుంది!
చెట్టంటే అమ్మ! అఖాతంలో పట్టుగొమ్మ
అమ్మంటే అక్కా, చెల్లీ, ఆడకూతురూ....
అమ్మంటే వేదం
జీవన నాదం
అమృత భాండం!
వెల పలకని, తులతూగని అనురాగపు సంకేతం
పరతత్వానికి సందేశం!

* * *

ఒక్కడు... ఆయమ్మ పాదాలకు నీరు పోస్తూ
మరొక్కడు ఆయమ్మ పాదాలనే పెకలిస్తూ....
వాడికీ, వీడికీ ఒక్క అక్షరమే తేడా
వాడు నరుడు! వీడు వా_నరుడు!
ఐతే నువ్వెవ్వడు?

— జి పి

# కలగూరగంప

## బెణకయ్య - కవి - గమకి - ఒక పరిశీలన

శాసనములు కేవలం చారిత్రిక ఆధారాలు మాత్రమే కావు. అవి మన దేశం యొక్క సామాజిక, సాంస్కృతిక, సాహిత్యక అంశములను గూర్చి వెలుగులు చిమ్ము అపూర్వములగు దృష్టాంతాలు, సాహిత్యక చిత్రాలు, వ్యక్తుల ఆత్మ చరిత్రలు.

తాడిపత్రి తాలూకా బొందలదిన్నె పొలిమేరలో పుట్టు బండకు వ్రాసియుండే రెండు తెలుగు పద్యాలు, తెలుగు సాహిత్య దృష్టిలో చాలా ముఖ్యమైనవి. ఈ శాసనము 'బెణక' అనే కవిని గురించిన వివరాన్ని మనకు అందజేస్తుంది. ఈ రెండు పద్యాల్లో బెణకాఖ్యుడు తనను గురించి చెప్పుకొన్నాడు. ఇది వఱకు ప్రకటితమైన తెలుగు సాహిత్య చరిత్రలో ఇతన్ని యెక్కడా గుర్తించినట్లు మాకు తెలియదు. ఇదే బెణకయ్య క్రీ.శ. 1678, (శక సం॥ 1600) కాలానికి చెందిన ఒక శాసనంలో ప్రస్తావింపబడ్డాడు. ఆ శాసనంలో భీమరాజుగారి బెణకయ్య అని పేర్కొనబడ్డాడు.

ఆ రెండు పద్యాలు యిలా వున్నాయి.

శ్రీ నరసింహదేవుని విశేష కృతిన్ రచియించ నేర్తునో,
మానవనాథులార నను మక్కువ జేయుచు ఆదరిం [చుండీ]
మానిత వెన్నినామకుల మాన్యుడ భీమయమంత్రి పుత్రుడన్
మాని భళంకరాంబ సుకుమారుడ నే బెణకాఖ్య సత్కవిన్.

రాగ గరిమ నెరిగి రహిమీర పదములు
పాడనేర్తు ద్విపద పద్య పణితి
తెలిసి చదువ నేర్తు ధీమంతు లౌనన
పేర్మి భీమయార్యు బెణక కవిని.[1]

పై మొదటి పద్యం వలన యీ బెణకయ్య తండ్రి పేరు భీమయ మంత్రి అనీ, తల్లి శంకరాంబ అనీ, 'వెన్ని' అనే వంశంలో యితడు పుట్టినాడనీ, ఇతడు నరసింహస్వామిని గురించి కృతిని రచియించి వుండవచ్చుననీ తెలుస్తూంది.[2]

రెండవ పద్యం యిప్పుడు తెలుగు సాహిత్య క్షేత్రంలో పూర్తి అపురూపమైయున్న గమక కళను, అనగా కావ్యవాచనమును గూర్చి తెలుపుతూంది. కవి కేవలం కావ్యరచన చేస్తే చాలదు. ఆ కావ్యం సహృదయుని మనసున హత్తుకొనగల్గి అంతే సమర్థంగా పఠింపబడాలి. కావ్యం యెంత బాగా చదువబడుతుందో అంత సమర్థంగా సహృదయుని మనస్సు ఆకర్షింపబడుతుంది. బెణకయ్య తన కవిత్వాన్ని గూర్చి మిక్కిలి వినయముతో 'శ్రీ నరసింహదేవుని విశేషకృతిన్ రచియించ నేర్తునో' అని చెప్పుకున్నాడు. ఐతే తాను కావ్యపఠనం చేయటంలో మాత్రం పూర్తి గర్వంతో, తాను ధీమంతులు మెచ్చుకొనునట్లు రాగ తాళములను తెలిసి మధురముగా పాడనేర్తుననియు ద్విపద ఛందస్సులో కావ్యము యొక్క పద్ధతిని తెలిసి చదువగలనని చెప్పుకొన్నాడు. ఈ ఒక్క అంశము ఆంధ్రదేశంలో గమక కళ ప్రచారంలో వున్నదా! అను సంశోధకుల సందేహానికి తెర వేసినది.

గమక కళను గూర్చి విశేషమైన అధ్యయనము తెలుగులో జరిగినట్లు మా అవగాహనకు రాలేదు. శ్రీ కాశూరి హనుమంతరావుగారు మాత్రం 1989 సం॥ జూన్ 'భారతి'లో 'కొన్ని శబ్దార్థాలు' అనే వ్యాసంలో (పు-12) గమకి(న్) గురించి వ్రాస్తూ—

'గమకి' అనగా మంచి శయ్యలో గమకముగా పద్యము చదువువాడు. "కవి గమకి వాగ్మిగాయక నటచింతామణి." (కుమా. సం. నన్నిచోడ - 3, 112). కన్నడంలో కూడా ఈ పదం ప్రయుక్తమై ఉంది. తెలుగు కన్నడములు రెండింటిలోనూ "కవి, గమకి, వాగ్మి" అన్న సమాహారమునందే కానవస్తున్నది. (నే. వెం. రమణయ్య వ్యాఖ్య). ఇంకా హర. విలా 1, 7). గమకము కలవాడు అన్న వ్యుత్పత్తిని బట్టి ఈ శబ్దం నకారాంతం కావచ్చును. సంస్కృత గ్రంథాలలో "ప్రయోగం మృగ్యం." అన్నారు.

కానీ వారు గమకి అంటే ఎవ్వరు, గమక కళ అంటే ఏమిటి? అని వ్రాయలేదు.

ఇంకను ఎవరైన దీనికి సంబంధించిన వివరములను తెలియబరచినచో మేము వారికి ఋణపడి వుంటాము. తెలుగులో

గమక కళను గూర్చి తెలిసికోవలెనను కుతూహలముతో కన్నడ ఆచార్యులైన డా॥ చిదానంద మూర్తిగారు, శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారిని సంప్రదించారనీ, శ్రీ మూర్తిగారే వ్రాసిన ప్రాచీన కర్నాటక దల్లి 'గమక-గమకి గళు' పరిశోధనా వ్యాసము వలన తెలినసిది.[3]

శ్రీ రాళ్ళపల్లిగారు, శ్రీమూర్తిగారి కిచ్చిన్న వివరములను సంక్షిప్తంగా అథస్సూచికలో శ్రీమూర్తిగారే తెలిపినారు. దాని యథానువాదం యీ క్రింది విధంగా వున్నది.

'తెలుగులో గమకము ప్రత్యేక కళగా వృద్ధి పొందలేదని నన్నెచోడుడను కవి, కావ్యంలో గమకి వాగ్మి అను ఉక్తి ఉన్నప్పటికీ దానిని కన్నడ కావ్యాల్నుండీ స్వీకరించినట్లు తెలుస్తూంది. అని శ్రీ రాళ్ళపల్లివారు తెల్పిరి. కర్నాటకలో ఆ మాటకు వచ్చే పారిభాషక అర్థమునకు సంస్కృతంలో కానీ తమిళంలో కానీ లేదని వారి నుండియే తెలియవచ్చింది.[4]

పై శాసన నేపథ్యంలో రాళ్ళపల్లివారి అభిప్రాయాన్ని పరిశీలిస్తే వారి అభిప్రాయం అంత సరియైనది కాదేమోనని తోస్తుంది. ఇప్పుడు ఆంధ్రదేశంలో కావ్యపఠనం అనునది విశేషమైన కళారీతిగా కనిపించకుండా వుండవచ్చు. ఐతే నిరక్షరాస్యులు హెచ్చుగా వుండే ప్రాంతాల్లో కావ్యాన్ని చదివించుకొని వినే పరిపాటి ఇప్పటికీ వుండనే వుంది. చదివేవాని కళానైపుణ్యాన్ననుసరించి పఠన కళయొక్క కీర్తి నిల్చివుంటుంది. మైసూరు రాజగు చిక్కదేవరాయలవారి ఆస్థానంలో వుండిన తిరుమలార్యుని గూర్చిన ఒక తామ్రశాసనం అతడు కర్నాటక, ఆంధ్ర సంస్కృత కవితావాచనంలో అపూర్వమైన ప్రతిభను కల్గియుండెనని తెలుపుతూంది.[5]

దాక్షిణాత్య మీమాంసకులు, పాండిత్యమును కవి, గమకి, వాగ్మి, వాది అనబడు నాల్గు విభాగములుగ విభజించినారు. సంస్కృతములో కూడ పాండిత్యమును యిదేరీతిగా నాల్గు విభాగములుగ వింగడించినట్లు తోచుచున్నది. క్రీ.శ. 838 సం॥నందు సంస్కృత కవులైన జినసేనాచార్యులు 'సుమంతభద్ర' అను కవిని గూర్చి తెల్పుతూ—

కవీనాం గమకానంచ వాదినాం వాగ్మినామపి।
యశః సామంత భద్రీయం, మూర్ధ్ని చూడామణీయతే (5ఎ)

అని పొగడినాడు.

తమిళ సాహిత్యంలో 'పులమే యోర్ నాల్వగై యిప్పడు వర్ కవి, గమగన్, వాది, వాక్కి అని పాండిత్యమును నాల్గు రీతులలో విభజించియున్నారు. గమకన్ అనేదానికి అర్థాన్నిలా చెబుతారు.

'గమకన్' - 'అరుంబొరు కై చ్చెంబొరుళ్ నడై యాయ్ క్కాట్టిప్పాడువోన్' అంటే - 'గూఢమైన అర్థాన్ని తెలిసేటట్లు విడమరచి పాడేవాడు' అని చెప్పాడు.[6]

సంస్కృతాలంకారికుడైన రాజశేఖరుడు కావ్యవాచన కళను 'పాఠకళ' అంటాడు. ఒకచోట యితడు 'అంతో ఇంతో సంస్కారం కలవాడు ఎలాగో కావ్యాన్ని రచించవచ్చు కానీ, సరస్వతి యెవరికైతే ప్రసన్నురాలౌతుందో అతడు మాత్రం మంచి పఠనకళను తెలిసికొని వుండగలడు' అని చెప్పాడు.[7]

బెణకయ్య చెప్పుకొన్నట్లు, కవి యొకడు కేవలం తన కావ్యరచన మాత్రమే కాక, కావ్యపఠన కళానైపుణ్యాన్ని గూర్చి చెప్పుకొనడం చాలా అరుదు. పంపని తమ్ముడైన జినవల్లభుని గూర్చిన వివరములను తెల్పు కరీంనగర్ జిల్లా శాసనము, జినవల్లభుని కావ్యతత్వమును చూచి, మెచ్చుకొనునట్లు కావ్యరచన చేయడం, కావ్యపఠనం చేయగల్గిన శక్తి కలవాడు ఈతడని ఈ శాసనం తెలియజేయుచున్నది.

గీతంగాతు మనేక భేదసుభగం కావ్యాని సోచ్చావచం
వాచా వాచయితుం ప్రియాణి వదితుం సాధూ పకర్తుం సతాం
భోగాన్సేవితు మంగనార మయితుం, పూజాం విధాతుంజనే
జానీతే జినవల్లభః పరమిదం పంపాభి ధానానుజః॥

చదురమె య్మెయ సత్కవిత్వదసన్న పంపన తమ్మనో
పొగశయే బాజిసల్ప రెయల్కవిత్వద తత్వదోళ్
పుదిదునేర్పడే పేరలుర్విగ పూర్వమాగిరె బల్లోన
ప్పు దటి నొర్వొనె వాగ్వధూ వరవల్లభం జినవల్లభం॥[8]

గమికియైనవాడు, కావ్యపఠనం చేయునపుడు పద్యపఠన మార్గంలో మిక్కిలి పైస్థాయిలో వుండే పదభావము మరియు రాగభావము వీటి సమన్వయ క్రమమును పరిశీలించియుండాలి. అనగా తాను చదువుతున్న సాహిత్య సన్నివేశము యొక్క రస పోషణకు అవసరమైయుండే స్వర విశేషములనే ఉపయోగించి పాడవలెను.

గమకియు సంగీతాన్ని బాగా అభ్యసించి యుండాలి. దాని యందు ఉత్తమ జ్ఞానము కలిగియుండాలి. కంఠధ్వని వైదుష్య

ములు కల్గి స్వయంగా కవియై యుండాలి. వ్యాకరణ జ్ఞానంతో పాటు, సంగీతజ్ఞానము, రసానుగుణమగు రాగాలాపన, కాలాను గుణమగు రాగము వీని సంపూర్ణ జ్ఞానము కలిగి వుండాలి. రసాను గుణమగు ధ్వనిని, గాత్రాన్ని, రాగాన్ని అనువుగా మార్చుకుంటూ పాడాలి. కవియొక్క ఆశయాన్ని తాను మొదట తెలిసికొని, అర్థాన్ని బాగా గ్రహించి, రసానుభవము పొంది, ఆ అర్థం ఇతరులకు తెలిసేటట్లుగ రసోన్మీలనమై శ్రోతలకు హృదయ రంజితమగునట్లు చదవాలి.

స్పష్ట వర్ణోచ్చారణ, సుశ్రావ్యత, పదవిభాగ నిర్ధారణ, ఛందోన్వయము, ఔచిత్య శోభితమగు సంగీతము అను ఈ ఐదు అంశములు కవికి గల భావాన్ని స్పష్టపఱచుటలో ఆధారభూతము లగుచున్నవి.

బహుశః వాచనకళ ఏమంత క్రొత్త అంశము కాదు అని ఎవరైనా అనుకొనవచ్చును. ఐతే ఈ కళను గురించి యిదివరకు ఎవరూ విశేషంగా వ్రాసినట్లు కన్పించలేదు. కావున ఇదివరకు తెలిపిన అంశములు స్ఫురణ చేసుకొంటూ మరిన్ని విషయములు వివరిస్తున్నాము. మహబూబ్‌నగర్ జిల్లా, నాగర్ కర్నూల్ తాలూకా, వర్ధమానపురం గ్రామంలో క్రీ.శ. 13వ శతాబ్దమందు కాకతి గణపతిదేవ చక్రవర్తి సామంతుడు మల్యాల గుండయ్యా గారు వేయించిన సంస్కృత తెలుగు శాసనాల్లో తెలుగు గద్య మందు గుండయ్యా సభను వర్ణించు సందర్భమున ఆ సభలో కవి, గమకి, వాది, వాగ్మి మొదలగువారుండిరని తెలియుచున్నది.

నన్నయ భారతములోని అవతారికా పద్యములను మేము సూక్ష్మముగ పరిశీలించినపుడు, కావ్యము ఒకనిచేత చదువబడు చుండ పలువురు వింటూ ఆనందించేవారని తెలుస్తుంది.

'భారత శ్రవణాసక్తి, వినంగనది యిష్టము, పురాణములు వింటి' అనే ప్రయోగాలు కావ్యము ముఖ్యంగా శ్రవ్యమైనదను టను సూచిస్తున్నది. నన్నయ బహు జాగ్రత్తగా మిక్కిలి సహజ ముగ రాజరాజ నరేంద్రుని నోటినుండి....

"విమలమతిం బురాణములు వింటిననేకము లర్థధర్మ శా
స్త్రముల తెఱం గెఱింగితి సుదాత్త రసాన్విత కావ్యనాటక
క్రమములు పెక్కు సూచితి జగత్పరిపూజ్యమునైన యీశ్వరా
గమముల యందు నిల్పితిఁ బ్రకాశముగా హృదయంబు భక్తితోన్."

అని పలికించినాడు.

పురాణములు వినుటకు (ఎవరైనా యీ పని చేయవచ్చును) శాస్త్రములు చదువుకొనుటకు (జ్ఞానమున్నవారికి) నాటకములు చూచుటకు (అందరికీ అందుబాటులో వుండునవి) హృదయాన్ని భక్తితో నిల్పి ఆ దేవుని ప్రార్థించుటకు ప్రయత్నము చేయ నగును.

ఈ విధంగా పఠనకళ శాసనస్థకాల పూర్వోత్తరకాలము అందు అన్నిరకాల జనుల నిత్య వ్యవహారములందు నిండియున్న దని తెలియుచున్నది. 'గమక'మనే పారిభాషిక పదము లేక పోవచ్చును. కానీ ఆంధ్రదేశములో కావ్యావాచన కళ పూర్తిగా లేదని చెప్పుటకు వీలుకాదు. దీన్నిగురించి పరిశోధకులు సాహిత్య ప్రియులు మిక్కిలి పరిశోధన చేయాలని మనవి చేస్తూ ఈ ప్రాచీన కళ పునరుజ్జీవనానికి నాంది పలుకగలరని భావిస్తున్నాము.

## అధస్సూచికలు :


1) కడప శిలాశాసనములు వగయిరా (సం) డా॥ ఎస్. వెంకట రమణయ్య, తమిళనాడు గవర్నమెంటు ఓరియంటల్ సీరిస్ నెం: ఇ ఎల్ 9, పేజీ నెం-670.
2) అదే. పు-668
3) డా॥ ఎం. చిదానందమూర్తి, ప్రాచీన కర్నాటకదల్లి-గమక మత్తు గమకిగళు-గమకకలె, కన్నడ సాహిత్య పరిషత్తు1974 పేజీ నెం-44.
4) అదే. పు-57.
5) అదే. పు-57.
5) ఎ) ఆర్. నరసింహాచార్య, గమకి కలె; క.సా.ప పేజీ-2.
6) అదే. పు-4, 5.
7) కన్నడ కావ్యమీమాంసె; (అను. జి. క్రిష్ణమూర్తి) పు. 67-70
8) శాసన సంగ్రహ
6) ఆంధ్ర మహాభారతం. (ఆదిపర్వం-10వ పద్యం)


ఈ వ్యాసం వ్రాయడంలో మాతో సహకరించిన ఆచార్య శలాక రఘునాథ శర్మగారికి, గడియారం రామకృష్ణ శర్మ గారికి, డా॥ హెచ్. ఎస్. బ్రహ్మానందగారికి మా కృతజ్ఞతలు.

డా॥ ఆర్. శేషశాస్త్రి
శ్రీ ఎం. ఆదినారాయణశాస్త్రి

# పాఠ్య పుస్తకాలలో దోషాలు

# తెలుఁగుకు దుర్గతి

ఇప్పుడు వాడబడుతూన్న 10వ తరగతి తెలుగు పాఠ్య గ్రంథాన్ని చూడవలసివచ్చినది. పాఠాల చివరలలో ఇచ్చిన అర్థాల లోను వ్యాకరణ విషయాలలోను అనేక దోషాలు ఉన్నాయి. పెద్ద డిగ్రీలు పొంది, పెద్ద పెద్ద పదవులలో ఉన్నవారు వ్రాసి పెట్టినట్లు కనబడే విషయాలను దోషాలుగా నిర్ణయించి, మార్చి చెప్పడానికి సాధారణంగా ఉపాధ్యాయ పండితులు సాహసించలేరు. ఎవరైనా కొందఱు సాహసించినా, వీరు చెప్పినవే తప్పులై యుంటాయని సాధారణ జనులు అనుకునే అవకాశం కూడా ఉంటుంది. ఆ దోషాలేవో గమనించడానికి ముందు, అవి సంభవించడానికి కారణాలు ఏవియై యుండవచ్చును అనేది సూచిస్తాను.

"ఇతరులు చెప్పినట్లే మనమూ చెపితే మన గొప్పదనం ఏమున్నది? మన సొంత వ్యక్తిత్వం అంతటా ప్రదర్శించవద్దా?" అనుకొనే మనస్తత్వం ఒక కారణం. తమ ఘనత యేదో చూపాలనుకోడంలో తప్పులేదు. కాని, దానిని ఏ తీరున ఏ ప్రయోజనం కోసం చొప్పించాలి అనేది సరిగా ఆలోచించుకోకపోవడంలో ఉన్నది, తప్పు. క్లిష్టమైన విషయాలను సుగమం చేయడానికి, సందిగ్ధాంశాలను తేటపరచడానికి, అసమగ్రాలను సమగ్రం చేయడానికి- ఇట్లా ఉన్న దానిని మెఱుగుపరచడానికి ఉపయోగపడాలి. "ఇంజెక్షను అందఱూ చేసేచోట్లనే చేస్తే నా గొప్పదనం ఏమిటి?" అనుకొని, డాక్టరు వేఱు చోట్ల చేసే రీతిని 'ఒరిజినాలిటీ'ని ప్రదర్శిస్తే, రోగికి ఎట్టి గతి పట్టుతుందో, అట్టి గతి ఆంధ్ర భాషకు ఈ అనుచిత ఉపజ్ఞా ప్రదర్శనాల వల్ల కలుగుతుంది. సూత్రాలున్నాయి. వాటికి వృత్తులున్నాయి. వార్తికాలున్నాయి. భాష్యాలున్నాయి. వాటికి వివరణాలున్నాయి. ఇవన్నీ ఘనతా ద్యోతకాలే. ఇవన్నీ సూత్రగతాలైన అర్థాలకు మెఱుగుపెట్టాయిగాని, నాశనం కలిగించలేదు.

ఇక రెండవ కారణం : ఒక పదాన్నిగాని, పద సమూహాన్నిగాని ఒకసారి వాడితే, మళ్ళీ దానిని వాడగూడదనే విచిత్ర మనస్తత్వం. వాడినదే మళ్ళీ వాడితే, అది పేవలంగా ఉంటుందనో, సౌందర్య భంజకం అవుతుందనో, రచయితకు వేఱే పదాలు స్ఫురించలేదనిపిస్తుందనో నేటి విద్యాధికులు అనుకొంటున్నారు. (అది విద్యార్థులకు గూడా వ్యాపిస్తోందనేది వేఱే విషయం అనుకోండి!) శాస్త్ర విషయక రచనలలో స్పష్టత ముఖ్యం, నిర్దుష్టత మఱీ ముఖ్యం, సౌందర్యం కాదు. భంగ్యంతర భావప్రకటనాదులను కళాత్మక విషయాలలో వాడుకొంటే వాడుకోవచ్చునుగాని, శాస్త్ర విషయాలలో వాడుకోగూడదు.

పదప్రయోగరీతిచేగాని, వాక్యనిర్మాణ విధానంచేతగాని మఱీ అంత సుగమత్వాన్ని రానీయకుండా, 'ఆంధ్రవధూటి చొక్కపుం జనుగవ పోల్కి నర చాటు'గా, కొంత అస్పష్టతకు తావు ఉంచడమే ఒక అందం అనుకోడం మూడవ కారణం.

ప్రాచీన విధానంలో చదువుకొన్నవారు ఇట్లా వ్రాయలేదు. ఆధునిక విధానంలో విద్యాభ్యాసం చేసిన వారిలోనే యీ పైజెప్పిన లోపాలు ఉంటున్నాయి; పుష్కలంగా ఉంటున్నాయి. అందువల్ల, చెప్పవలసినది చెప్పదగిన తీరున చెప్పక, చెప్పదగనిది చెప్పగూడని తీరున చెప్పడం సంభవిస్తోంది. అసలు 'మూలకందం'గా శాస్త్ర పరిజ్ఞానంలో లోపం ఉండనే ఉన్నది, ఏ కొంచెమో! "కపి రపి చ కాపిశాయన మదమత్తః"!

ఉపన్యాసాలు చెప్పేటప్పుడు కట్టుదిట్టం కానట్టి పద ప్రయోగాలు, వాక్య నిర్మాణాలు ఉంటాయి. వ్రాసేటప్పుడు తరువాతి అందాన్ని గూర్చి ఆలోచించుకొంటూ ఉండడానికి కొంత వ్యవధి ఉంటుంది. ఉపన్యాసాలలో అది ఉండదు. కనుక కొంచెం 'లూస్ వర్డింగ్' అనదగినది ఎక్కడైనా వస్తే, అది క్షంతవ్యం అవుతుంది. కాగా, సావకాశంగా సావధానంగా కూర్చుండిచేసే రచనలలో అటువంటి అన్వయ దోషాదులు రాగూడదు. శాస్త్ర విషయక పదాలకు నిర్వచనాలు చెప్పే వాక్యాలలో అసలే రాగూడదు. ఆ వాక్యాలు ఎంత మేలుగా సాధ్యం అవుతుందో అంత మేలుగా ఉండాలి. ఈ విషయాలను గమనించనందువల్ల ఎన్నో తప్పులు కుప్పతెప్పలుగా వచ్చేస్తున్నాయి. రచించడం ముందుగా ఒక చిన్న ఉదాహరణం చూడండి. తరువాత శాస్త్ర పరిజ్ఞానానికీ, వాక్య నిర్మాణాదులకూ సంబంధించిన అంశాలను చూద్దాం.

1. 'శక్తియెట్లో - ఆ విధంగా అని (పుట 71) 'యథాశక్తి' పదానికి అర్థం వ్రాశారు. 'శక్తి యెట్లో అట్లు' అన్నట్లయితే, యచ్ఛబ్ద తచ్ఛబ్దాలకు గల సన్నిహిత సంబంధం విస్పష్టంగా కనబడుతుంది. 'శక్తి ఏ విధంగానో - ఆ విధంగా' అన్నప్పటికీ ఆ సాన్నిహిత్యం విస్పష్టంగానే ఉంటుంది. అన్న మాటను మళ్ళీ అనేట్లయితే, 'ప్రాత చింతకాయ పచ్చడి' ఐపోతుందనే బాధ వచ్చిపడినందున, 'ఎట్లో అట్లు' అని గాని, 'ఏ విధంగానో ఆ విధంగా' అని గాని వ్రాయలేకపోయినట్లున్నది.

2. "అన్య పదార్థ ప్రధానము బహువ్రీహి" అని వ్రాశారు (పుట 61) అట్లా చెపితే చాలదు. 'ప్రాయేణ' అనే అర్థం ఇచ్చేమాట

ఏదైనా చేర్చాలి. 'ప్రాయేణ' అని యెందుకు అనాలో గమనించక పోవడం వల్లనే, 'కందర్ప హరుడు' 'త్రిపథగ' అనే పదాలను బహువ్రీహికి ఉదాహరణాలుగా చెప్పగలిగారు, రచయితలు, (అట్టిపై పేర్లలో ఏది యీ 'నోట్సు' రచించిన వారిదో, మఱి!) ఇవి బహువ్రీహి సమాసాలు కావు. ఇచ్చిన (మూడు) ఉదాహరణాలు బహువ్రీహి సమాసాలు ఎట్లా అవుతాయో వివరించబూనిన రచయితలు ఈ రెండింటిని దాటవేశారు; బహువ్రీహిగా నిరూపించడం కుదరనందు వల్లనే ఐయుండాలి. ఇవి ఉప పదసమాసాలవుతాయి.

3. "విశేషణ విశేష్య పదాలకు సమాసం చేస్తే సమానాధికరణం అంటారు" అని ఒకచోట (పుట 23) చెప్పారు. కాని, మఱొకచోట (పుట 49) "విశేషణం కాక ఉపమానం పూర్వపదంగా, విశేష్యానికి బదులుగా ఉపమేయం ఉత్తర పదంగా ఉన్నప్పుడు" అనడం చేతను ఆ మొదటి మాటను తామే ప్రత్యాఖ్యానం చేశారు. కర్మధారయగత పదాలకు విశేషణ విశేష్య భావం నిశ్చితం కాదని చెప్పారన్నమాట. వాటికి విశేషణ విశేష్య భావం ఏదోయొక విధంగా ఉండి తీరుతుందని నిరూపించగలిగితేనే, ఆ మొదటి నిర్వచనం చెప్పాలి. నిరూపించలేనప్పుడు అట్లా నిర్వచించగూడదు. 'సమానాధికరణం' అనే పదాన్నే సరిగా వివరిస్తే, అవ్యాప్త్యాది దోషాలు లేని నిర్వచనం ఏర్పడేది.

4. ఉపమాన పూర్వపద కర్మధారయానికి చెప్పిన నిర్వచనంలో "విశేషణం కాక ఉపమానం పూర్వపదంగా, విశేష్యానికి బదులు ఉపమేయం ఉత్తర పదంగా" ఉంటాయని చెప్పి, 'తమ్మి కనులు' అనే సమాసాన్ని ఉదాహరణంగా చెప్పారు. ఇక్కడ 'కనులు' అన్న పదం విశేష్యం కాదన్నారన్నమాట. అది విశేష్యమే, మఱి! లక్షణం దారి లక్షణానిది, లక్ష్యం దారి లక్ష్యానిది! (పుట 49)

* అంతేకాక, 'తమ్మి కనులు' అన్న మాటకు 'పద్మం వంటి కన్ను లు' అని అర్థం చెప్పారు. 'కనులు' బహువచనం కాగా, 'పద్మం' ఏకవచనం! ఇటువంటి వచన భేదం కొన్నిచోట్ల ఒప్పినా, అన్నిచోట్లను ఒప్పదు!

* "పూర్వపదంగాను, ఉత్తరపదంగాను" అని సముచ్చయార్థకాలు చేర్చితే, అన్వయం చేసుకోడంలో కొంచెం సౌలభ్యం వచ్చేది. అవునో కాదో ఆలోచించండి.

5. పూర్వ పదార్థాన్ని ఉత్తర పదార్థంగా నిరూపిస్తే, రూపక సమాసం, లేదా, అవధారణా పూర్వపద కర్మధారయ సమాసం అంటారు" అని వ్రాశారు. (పుట 50) ('కామా'లు నేను చేర్చినవి.) ఇది సరియైన నిర్వచనం కాదు. 'వెలుగు పులుగు' అనే పదాన్ని ఉదాహరణంగా చూపారు. (ఈ పదం పాఠ్యభాగంలో లేదు; ప్రసిద్ధంగా చెప్పబడుతున్నదీ కాదు. రచయితలు సృజించారు' ఇందులో ఏమి సొంపు ఉన్నదనో, మఱి!) 'వెలుగు' అనే పదపు అర్థం 'కాంతి' గదా! పులుగు అంటే పక్షి. కాంతిని పక్షిగా నిరూపించడమేమిటి? అర్థంలేని నిర్వచనం అవుతోంది. "పులుగుయొక్క ధర్మాన్ని వెలుగునందు ఆరోపిస్తే" అనవలసినది. నిర్వచనం కూడా తదనుగుణంగానే ఉండవలసినది.

6. "అవ్యయీ భావ సమాసంలో పూర్వపదం అవ్యయంగాను ఉత్తరపదం నామవాచకంగాను ఉంటుంది" అన్నారు. (పుట71) మధ్యేమార్గం, పారేగంగం ఇత్యాదులు అవ్యయీ భావ సమాసాలే ఐనా, పూర్వ పదాలు అవ్యయాలు కావుగదా! అవ్యయీభావం అవ్యయీ పూర్వపదంగా ఉంటుందని ఎక్కడనో ఉన్నదిగదా అని యిక్కడ చెప్పగూడదు. అతి వ్యాప్త్య వ్యాప్తులు లేకుండేట్లు నిర్వచనాన్నిరూపొందించడం బాగుంటుంది.

* పూర్వపదం, ఉత్తరపదం అనే రెండింటినీ ఒకే క్రియా పదానికి కర్తృపదాలుగా చేసినప్పుడు క్రియాపదం బహువచనంగా ఉండాలి. "పూర్వపదం.... ఉత్తరపదం.... ఉంటాయి" అని.

* మఱొక విశేషం 'నామవాచకం' అన్న పదాన్ని వాడడం. ఈ పదం ఆంధ్ర వ్యాకరణ సంప్రదాయంలో వాడబడినది కాదు, బాల వ్యాకరణాదులలో లేదు. ఆంధ్రభాషా వ్యాకరణం తెలియని ఆంగ్లభాషా పండితులు ఆంగ్లభాషను బోధించేటప్పుడు — నిరుపయోగంగా, అజాగళ స్తన సదృశంగా- 'నౌన్' అనే పదానికి అర్థంగా సృజించినట్టిదది. విశేష్యం అనడానికి ఏమి ఆటంకం వచ్చినదో, మఱి!

7. విశేషణోభయపద కర్మధారయానికి 'ఎత్తుపల్లము' అనే దానిని ఉదాహరణంగా చూపించారు. (పుట 49) 'ఎత్తుపల్లము'అనే సమాసం ఎక్కడా ఉండదు. 'ఎత్తు పల్లములు' అనేది ఉంటుంది; ఉన్నది. అప్పుడు అందులోని పదాలు విశేషణాలు కావు; విశేష్యాలు. అది ద్వంద్వ సమాసం అవుతుంది. 'స్నాతానులిప్తుడు' అన్న విశేషణోభయపద కర్మధారయ సమాసంలో ఇమిడియున్న 'స్నాతుడు' 'అనులిప్తుడు'అనే రెండు పదాలకు సామానాధికరణ్యం పొసగుతుంది. అవి రెండూ ఒక్క వ్యక్తినే తెలుపుతాయి. 'స్నాతుడు' ఎవడో, వాడే 'అనులిప్తుడు' కూడాను. అట్లా "ఎత్తైనది యేదో, అదియే పల్లమైనది" అనడం పొసగదు. కనుక ఈ ఉదాహరణం అసంగతం. పూర్వ శాస్త్రకారులు కడు జాగ్రత్తతో ఉదాహరణాలు కూర్చారు. వాటికి బదులు మనం వేఱే ఉదాహరణాలను సృజించడం అనావశ్యకం. అదనంగా మఱికొన్ని చెప్పడానికైతే, ఆవశ్యకమే. కాని, సర్వదా సముచిత మైనవి తయారు చేయగలిగితేనే చేయాలి.

8. "మూడవగణం మొదటి అక్షరం యతి చెల్లుతుంది" (పుట 6)అనేదొక వాక్యంగా వ్రాశారు. 'చెల్లుతుంది' అన్న క్రియకు కర్త యేది? 'అక్షరం' అనేదా, కాక, 'యతి' అనేదా? 'అక్షరం చెల్లుతుంది' అనే వాక్యం అనుకొంటే, 'యతి' అనే పదానికి ఏ పదంతో అన్వయం ఉంటుంది? 'యతి చెల్లుతుంది' అనేదే అసలు వాక్యం అనేట్లయితే, 'అక్షరం' అనే పదానికి వాక్యంతో సంబంధమే ఉండదు. ఈ వాక్యం ఇట్లా వ్రాయడం పొరపాటేమో అనడానికి వీలులేదు. మఱి పెక్కుచోట్ల గూడా ఇట్లాగే వ్రాశారు. (పుటలు 18, 24, 35, 50) (శబ్దపల్లవమా?)

9. "పూర్వపదార్థాన్ని ఉత్తర పదార్థంగా నిరూపిస్తే, రూపక సమాసం, లేదా, అవధారణా పూర్వపద కర్మధారయ సమాసం అంటారు" అనే వాక్యంలో (పుట 50) 'రూపక సమాసం' అనే పదాన్ని 'అంటారు' అనే పదంతో అన్వయించుకొన్నాం అనుకోండి. అప్పుడు 'లేదా' అనే పదమూ, 'అవధారణా పూర్వపద కర్మధారయ సమాసం' అనే పదమూ ఏ పదాలతో అన్వయిస్తాయి? ఏ పదాలతోను అన్వయించవు. 'లేదా' అనే మాటకు ('లేదు+ఆ' కనుక) 'అంతకు మునుపు చెప్పినది కాకపోతే' అనే అర్థం వస్తుంది. ఆ అర్థం ఈ వాక్యంలో సరిపడడంలేదు, రూపక సమాసం అని తొలుత చెప్పిన మాటను కాదనడంలేదు గనుక.

10 "ఆసాయము=సాయము (సాయంకాలం) అన్న పదానికి ఆ(ఙ్) అనే ఉపసర్గ అని వ్రాసి, వదలివేసి, వాక్యం ఐపోయినదనుకొని, మఱొక వాక్యం ప్రారంభించారు. (పుట 81) 'చేరినది' అనే క్రియా పదాన్ని చేర్చితేనేగాని అది వాక్యం కాదు. "శ్రీరామునకు లక్ష్మణుడనే తమ్ముడు...." అని వ్రాసి వదలివేస్తే, వాక్యం ఏర్పడుతుందా? ఇది ఉపన్యాసం కాదుగదా!

11. విశేష్య - విశేషణాలని కాక రెండూ విశేషణ పదాలే సమాసమైతే..." అంటూ వాక్యం వ్రాశారు. (పుట 49) 'అని' అనేది యిక్కడ అసంబద్ధం; కనుక అర్థాన్ని అనవసరంగా క్లిష్టపరుస్తుంది. దానిని వదలివేసి చూడండి. "విశేష్య విశేషణాలు గాక రెండూ విశేషణాలే ఐతే" అవుతుంది గదా! 'అని' అని యెందుకు చేర్చినట్లు? 'సమాసమైతే' అని గాక, 'ఐతే' అని అంటేనే అన్వయం సుగమంగా ఉంటుంది. సమాసమైతే అనే అనదలచుకొంటే, 'రెండూ' అనేదానిలోని అప్యర్థకమూ, 'విశేషణాలే' అనేదానిలోని ఏ వార్థకమూ అసంగతాలవుతాయి. వాటిని తీసివేసి, "రెండు విశేషణాలు సమాసమైతే" అన్నట్లయితే, వాక్యం బాగుపడుతుందా, చెడిపోతుందా? ఇక్కడ రచయితలు చెప్పదలచుకున్నది—వికృత శబ్ద వ్యాయామం లేకుండా చెప్పాలంటే— "పూర్వ ఉత్తర పదాలలో ఒకటి విశేషణమూ మఱొకటి విశేష్యమూ కాకుండా, రెండూ విశేషణాలే ఐతే, ఆ సమాసం విశేషణ ఉభయపద కర్మధారయం అవుతుంది" అన్న మాట.

12. "ఆసాయము = సాయము (సాయం కాలం) అన్న పదానికి ఆ (ఙ్) అనే ఉపసర్గ" అన్నారు గదా! (పుట 81) ('చేరుతుంది' అని చేర్చవలసినది అని పైకి వివరించబడినది.) ఆఙ్ అనే ఉపసర్గం 'సాయము' అనే పదానికి చేరదు; 'సాయం' అనే పదానికి చేరుతుంది. సాయం అని సంస్కృత భాషా రూపంలో ఉండగా, ఆఙ్ చేరి, 'ఆసాయం' అనే రూపం సిద్ధమైన తరువాత, దానిని తెలుగులోకి గ్రాంధిక రూపంలో తెచ్చుకుంటే, 'ఆ సాయము' కావచ్చును.

13. "కొఱకు అనే అర్థంలో పదాల చివర ఏడు చేరుతుంది" అని వ్రాశారు. (పుట 41) పదాల చివరలందు చేరేవి ప్రత్యయాలు, 'ధనము కొఱకు' ఇత్యాదులలోవలె, ప్రత్యయాలవలె అర్థ విశేషాలను బోధించే ఇతర పదాలు కూడా - వఱకు, మీద మొదలైనవి-ఉంటాయి. అవి కూడా పదాల చివరలలో చేరుతాయి. ఏడు అనేది వాటివంటిదని యీ రచయితల అభిప్రాయమా? అది స్వతంత్రమైన ధాతువు. ఇంకొక పదానికి చివర చేరడం ఏమిటి?

14. సకారానికి క ఖ ప ఫ - లు పరమైతే (దానికి) విసర్గం ఆదేశంగా వస్తుందన్నారు. (పుట 12) విసర్గాన్ని హకారంగా గదా, పలుకుతాము? ఈ చెప్పిన చోట్ల పలుకబడేది హకారం కాదు. కఖ-లు పరమైనప్పుడు జిహ్వామూలీయం గాను, ప ఫ - లు పరమైనప్పుడు ఉపాధ్మానీయం గాను పలుకుతాము. ఇవి విసర్గకంటె భిన్నమైనవని సూచించేందుకు, పూర్వపు అచ్చులో విసర్గాన్ని మార్పుచేసి వేసేవారు. విసర్గంలోని పైసున్నలోని పై అర్ధభాగాన్నీ, క్రింది సున్నలోని క్రింది అర్ధభాగాన్నీ తీసివేస్తే ఎట్లా ఉంటుందో అటువంటి చిహ్నాం వేసేవారు - ῠ - ఈ విధంగా . కనుక విసర్గం ఆదేశంగా వస్తుందనడం తప్పుదారి పట్టించడం అవుతుంది.

15. "గోపాలుడు (ఇంద్రుడు)వరకు" అని (ఆబాలగోపాల శబ్దార్థంలో) వ్రాశారు. (పుట 81) గోపాలుడు అన్న ప్రథమాంత

శబ్దం 'వలుకు' అనే పదంతో అన్వయించదు. 'గోపాలుని పలుకు' అనే అనాలి. 'బాలుడు మొదలుకొని' అని వ్రాశారు, అదీ తప్పే.

16. "అజరామరము = ముసలితనం లేని, మరణం లేని" అని అర్థం వ్రాశారు. (పుట 105) విభక్త్యంత పదానికి అవిభక్త్యంత మైన శబ్దాన్ని అర్థంగా చెప్పడం సరికాదు. 'అతని కీర్తి అజరామరము' అనడానికి బదులు 'అతని కీర్తి ముసలితనం లేని, మరణం లేని' అంటే సరిపోతుందా? ముసలితనం లేనిది-అని యిట్లా తచ్ఛబ్ద సహితంగా, విభక్త్యంతంగా చెప్పాలి.

17. మరికొన్ని వింత 'నోట్స్' ఉన్నాయి. 'దానవులు' అనే శబ్దానికి వ్యుత్పత్త్యర్థం "దనువు అనేవాని వంశంలో జన్మించిన వారు" అని చెప్పారు. (పుట 6) దానవులు దనువు అనే స్త్రీయొక్క సంతానం; దనువు అనే పురుషుని వంశపు సంతానం కాదు. 'దనుడు' అనే ఒక పురుషుని పేరుకూడా ఉన్నది. కాని, అది బదరికాశ్రమంలో ఉన్న ఒకానొక ముని పేరు, దానవుల తండ్రిపేరు కాదు. దానవుల తండ్రి కశ్యపుడు.

సంస్కృత శబ్దాలకు వ్యుత్పత్త్యర్థాలు చెప్పేటప్పుడు సంస్కృతంలో చెప్పే విధంగానే చెప్పాలి. భాషాంతరీకరణం మాత్రమే మనం - తెలుగులో చెప్పేటప్పుడు - చేయదగినది. 'దనోః అపత్యం పుమాన్ దానవః' అని ఉన్నప్పుడు, 'దనువుయొక్క సంతానమైన పురుషుడు' అని చెప్పాలన్నమాట 'దనువుయొక్క సంతానమైన వాడు' అని అన్నప్పటికీ 'వాడు' అనే శబ్దంచేత పురుషుడు అనే అర్థం వచ్చేస్తుంది. వ్యుత్పత్త్యర్థం చెప్పడం అంటే, ఆయా శబ్దాలకు ఆయా అర్థాలు ఏ విధంగా ఏర్పడ్డాయో చెప్పడం; అంతేగాని పురాణగాథల వంటి విషయాలతో వివరించడం కాదు. సంప్రదాయాలు అనేవి పెద్దలు చాలా కాచి వడపోసి తీర్చి దిద్దినట్టివి. వాటిని అడ్డదిడ్డంగా మార్చివేయడం ఉచితం కాదు. కాగా, దైత్యులు అనే శబ్దానికి 'దితియొక్క సంతానమైనవారు' అని చెప్ప వలసి ఉంటుంది గాని, 'కశ్యప ప్రజాపతి పెద్దభార్యయైన' అనే యిటు వంటి వివరణాలను కలుపగూడదు. వాటిని వేఱుగా చెప్పాలి.

18. రసాతలం అనే మాటకు పాతాళం అని అర్థం చెప్పారు. (పుట 23) 'సప్త అధోలోకాలలో ఆఱవదానిపేరు' అని చెప్ప వలసినది. 'పాతాళం' ఆ యేడింటిలో ఏడవది అయినా, రసాతలం అనే మాటకు పాతాళం అనే అర్థంలో కూడా వాడడం కద్దు అని వివరించవచ్చును.

19. 'కులు చిలు......' ఇత్యాది సూత్రాన్ని వివరిస్తూ, "ద్విరుక్త టకారం=ద్విత్వటకారం" అని అర్థం చెప్పారు. (పుట 81) ద్విరుక్తటకారం అంటే రెండుసార్లు పలుకబడిన టకారం అనే అర్థం సొపుగా తెలుస్తుంది. ఆ విధంగా ద్విత్వ టకారం అనే మాటకు అర్థం సొపుగా ఉండదు. 'ద్విరుక్త' అనేది విశేషణం. 'ద్విత్వ' అనేది విశేష్యం. ద్విత్వ అన్న విశేష్యాన్ని టకారం అన్న విశేష్యంతో కలిపి సమాసం చేస్తే, దానికి అర్థం సొపుగా కుదురదు. ఇది అసాధువు గాదుగాని, ఇచ్చితంగా అర్థక చెప్పడానికి వీలయినదికాదు.

మఱొక చిన్న విశేషం : 'కుఱు + ఉసురు' అని శకట రేఫంతో వ్రాసి, వెంటనే 'కుర్ + ఉ' అని సాధురేఫంతో వ్రాయడం సరికాదు.

20. సకార సంధిని వివరిస్తూ 'విసర్గ ఆదేశంగా వస్తుంది' అని వ్రాశారు. (పుట 12) గ్రాంథికంగా వ్రాస్తే 'విసర్గము' అనాలి. వ్యావహారికంగా వ్రాస్తే 'విసర్గం' అనాలి. 'విసర్గ' అని మాత్రం వ్రాస్తే అది అపశబ్దం అవుతుంది. పలుచోట్ల విసర్గ అనే వ్రాశారు. అట్లాగే పలుచోట్ల (పుట 81) 'ఉపసర్గ' అని వ్రాశారు. విసర్గ శబ్దానికి చేసిన వివరణం దీనికి కూడా వర్తిస్తుంది.

21. 'తెవులు' అనే మాటకు 'పశువులకు వచ్చేరోగం' అని అర్థం చెప్పారు. (పుట 23) నిఘంటువులో వ్యాధి అని మాత్రమే ఉన్నది. 'తెగులు గొంటు' అనే మాటకు వ్యాధిగ్రస్తుడు, వ్యాధిగ్రస్తురాలు, వ్యాధిగ్రస్తము అనే అర్థాలు నిఘంటువులో ఉన్నాయి. కాగా, (తెగులు అనేది తెవులు అనే దాని రూపాంతరమే గనుక) తెవులు శబ్దానికి మానవులకు వచ్చే వ్యాధి అనే అర్థం కూడా వస్తుంది.

22. సంధి విడదీసి వివరించండని పేర్కొన్న పదాలలో 'కేకిసగ్లొట్టు' అనేది ఉన్నది. గ స డ ద వ్రాదేశాన్ని వివరించాలా? ఉత్వ లోపాన్ని గూడా వివరించాలా? అనే సందేహం కలుగుతుంది. 'కేకిసల్' అనే హలంతపదం అప్రసిద్ధం గనుక, అది మొదటి పద మని గమనించడం సులువు కాదు. రెండు సంధి కార్యాలు ఒకేచోట ఉండేట్లు ప్రశ్న రూపొందించడం సముచితం కాదు.

23. "కర్మధారయ సమాసంలో మొదటి పదం చివరి 'లిలు' వర్ణానికి 'పు' లేదు 'లిపు' ఆదేశాలుగా వస్తాయి" అని వివరించారు.

(పుట 105) పు-ంపు-లు అనేవి రెండైనా, ఆదేశం ఒక్కటే. పు-ఆదేశం ఒకటీ, బిందు పూర్వక - పు - ఆదేశం ఒకటీ కావున ఆదేశాలు రెండు అవుతున్నాయనరాదు. ఒక వర్ణానికి ఒక ఆదేశమూ, మరొక వర్ణానికి మరొక ఆదేశమూ 'ఏక కాలంలో' సంభవిస్తే, అటువంటిచోట రెండు ఆదేశాలు అనవచ్చును. ఇక్కడ 'ము' వర్ణం ఒక్కటే. దానికి ఆదేశంగా వచ్చేది కూడా ఒకటే. రాదగినవి రెండు ఉన్నా, ఒకటి వచ్చినప్పుడు రెండవదిరాదు. కనుక ఆదేశం ఒక్కటే. "'పు' లేదా 'ంపు' వస్తాయి" అనడంలోనే "ఆ రెండింటిలో ఒకటియే వస్తుంది" అనే అర్థం ఉన్నది; 'పు' గాని 'ంపు' గాని అన్నమాట. "అన్నగాని తమ్ముడుగాని వస్తాడు" అనాలా, 'వస్తారు' అనాలా? ఇక్కడ ఈ రచయితలు 'కాని-కాని' అనే జంటను వాడక, ఆంగ్ల భాషలోని 'ఆర్' అనే పదాన్ని అనుసరించి, తెలుగు నుడి కారానికి భిన్నంగా, 'లేదా' అనే పదాన్ని (వాస్తవంగా ఇది పద సముదాయం అవుతుంది)వాడారు. ఆంగ్లభాషలోనైనా, 'ఆర్' వాడ బడినచోట ఏకవచనమే వస్తుంది. బహువచనం రాదు.

24. మనస్సులోపలి భావాల సూచన ముఖంలోనే కనబడు తుందన్నట్లు, గ్రంథం లోపలివైన యీ విషయాలకు సూచన 'ఇన్నర్ టైటిల్'లోనే కొంచెం కనబడుతోంది. 'సంకలనం-వివరణ' అని అక్కడ ముద్రితమై ఉన్నది. 'వివరణా' అని ఆకారాంత స్త్రీలింగ శబ్దం ఉన్నట్లు లేదు. కాగా, వివరణం అనే అనాలి. వివరణ అనేది అపశబ్దం అవుతుంది. ఇది అపశబ్దం అని తెలిసే వాడి నట్లయితే, 'సంకలన' అనే అపశబ్దాన్ని గూడా వాడవచ్చును గదా! సంకలనం అనే అనాలి అనుకొన్నట్లయితే, వివరణం అనాలనే తోచ వలసినది. రెండూ ఒకే విధపు శబ్దాలైనప్పుడు ఒకదానిని ఒక విధం గాను మరొకదానిని మరొక విధంగాను ఎందుకు వ్రాశారో, మరి! ఒకటి వ్రాసినట్లే మరొకటికూడా వ్రాస్తే, ప్రతిభ యెట్లా కనబడు తుంది అనుకోడమే కారణమా? ఏమో, మరి!

ఆచార్య...రామకోటిశాస్త్రి గారు సంపాదకులు అని పేర్కొన్నప్పుడు డా....సంపత్కుమారాచార్య గారు సంకలన కర్త అంటే బాగుండేది. అట్లా అనక, "డా...సంపత్కుమారాచార్య సంకలనం. వివరణ" అన్నారు; "సుబ్బన్నగారు మృదంగం" అన్నట్లు. సుబ్బన్న గారు మృదంగం అవుతారా? అసంభవం గదా! ఇదీ అట్లాంటిదే. "డా॥ సంపత్కుమారాచార్య సంకలనం, వివరణ" అన్నవారు 'ఆచార్య రామకోటి శాస్త్రిగారు సంపాదన' అనలేదు. ఎందుచేతనో, మరి! అట్టమీద ఉన్న మూడు పదాలలో - కేవలం ఉక్తివైచిత్ర్య ప్రదర్శనానికిగాను - ఇన్ని అనౌచిత్యాలు వచ్చినట్లున్నది.

ప్రభుత్వపు ఆదరణం పొంది, విశ్వవిద్యాలయ సంబంధాన్ని చెప్పుకొంటూ, ఈ పాఠాలను బోధించవలసిన ఉపాధ్యాయులకు బోధచేయగలిగిన వారమనుకొనే పెద్దలు ఇటువంటి 'నోట్స్' రచిస్తే, విద్యార్థుల గతి యేమికావాలి? ఇవన్నీ తుణ్ణంగా చదువుకొన్న విద్యార్థి యెవడైనా సరియైన వాక్య నిర్మాణ పద్ధతిని తెలుసుకోగలిగాడంటే, 'నాపేరు మాత్రం పెట్టండి' అని శపథం పట్టి, రచించారా అని ఉత్ప్రేక్షిస్తే, రచయితలు క్షమించవలసి ఉంటుంది.

ఈ పేర్కొన్న తప్పులవంటి తప్పులన్నీ రచయితలుగా పేర్కొనబడిన విశ్వవిద్యాలయాధ్యాపకులు వ్రాసినవే అని నమ్మడం సాధ్య కాదు. అయినా, వారి పేర్లే ప్రకటించబడడం చేత, వారు రచించ లేదనడానికి ఎవరికీ హక్కు ఉండదు. నిజంగా వారే వ్రాసియున్న ట్లయితే, - వారు కాక వేటే ఏ ఎం. ఏ. లు వ్రాసినప్పటికి - "దేశ భాషలందు తెలుగు లెస్స" అనిపించుకొన్న తేనె తెనుగుకు ఎంతదుర్గతి పట్టినది! ముమ్ముందు వచ్చే అధ్యాపకుల చేతులలో పడి ఇంకెంత పతనానికి పాల్పడుతుందో గదా! భగవంతుడా!" అని విచారపడవలసి వస్తుంది.

—శ్రీ చివుకుల వేంకట సుబ్బావధానులు

# గ్రంథ విమర్శలు

## వాల్మీకి రామాయణం అహల్యా ఇతివృత్తం

[రచయిత : శ్రీ కె. వి. కె. రామారావు, ప్రాప్తిస్థానం కేరాఫ్ కె. వి. రాఘవేంద్రరావు ఎ.పి.పి. మిల్క్ క్వార్టర్ డి/1-1 రాజమండ్రి-533 105. వెల : 20 రూ.]

గౌతముని ధర్మపత్ని అహల్య. బ్రహ్మ సంకల్ప సృష్టి. ఆ కన్య బాహ్య రూపరేఖలకు శచీపతి ఇంద్రుడు ముగ్ధుడై ఒకనాటి రాత్రి గౌతమాశ్రమానికి వచ్చి గౌతమ వేషధారియై లోన ప్రవేశించి అహల్యను చెరచినట్లు ఒకింత సేపటికి గౌతముడు వచ్చి ఇంద్రుణ్ణి అహల్యనూ భిన్నరీతుల శపించినట్లు వాల్మీకి చెప్పిన ఇతివృత్తం. ఆ విధముగానే ఇంద్రుణ్ణి అహల్యాజారుడని ఆక్షేపక బిరుదముతో వ్యవహరించడం కద్దు.

వాల్మీకి చెప్పినది సామాన్య లౌకిక సమాజానికి ఒక గుణ పాఠం అనీ - ఇది సక్రమముగా అంతర్య పరిజ్ఞాన పద్ధతిని సమర్థనీయం కాదనీ శ్రీ రామారావు సోప పత్తికముగా ఇందు వివరించి చెప్పడం అవగతం అయింది.

ఇంద్రుని దుష్కృతికి కోపించి పశ్చాత్తప్తురాలై అహల్య తనంత తానే శిలారూపిణి అయిందని హరికథా పితామహుని యథార్థ రామాయణం చెప్తోంది.

అహల్యయందు ఏలాటి దోషం లేదు కనుకనే ఆమె పతివ్రతా పంచకములో ప్రథమగణ్యురాలయిందని విబుధవాక్కు.

'అహల్యాయై జార' - అని ఇంద్రుణ్ణి సంబోధించే శ్రుతి సూక్తాన్ని శ్రీ రామారావు ఉదాహరించి వివరించడం దీనికి ప్రత్యక్ష ప్రమాణ వ్యాఖ్య అవుతూంది.

నిదానంగా చదివి నిజం తెలుసుకోవలసే పరిశీలన గ్రంథం ఇది.

## సీతాహరణం

( ఐదంకాల నాటకం )

[రచయిత : శ్రీ కాశూరి హనుమంతరావు, ప్రతులకు : శ్రీమతి కే. శేషుబాయి, ఎల్/58 ఉస్మానియా యూనివర్శిటీ కాంపస్ హైదరాబాదు-500 007.]

"ఈ పుస్తకానికి వెల లేదు. ఒక రూపాయి M.O. చేస్తే ఒక కాపీ బుక్ పోస్ట్ ద్వారా పంపబడుతుంది.

ఇది ముందు సంస్కృతములో వెలువడినదే. తెలుగులో అందరికీ తెలియాలని అనువాదం రూపాన రచించిన నాటకం.

అనుబంధ రూపాన ఉన్న 'రామాయణ సమాలోచనం' అనే శీర్షికతో ఉన్న విషయమును ముందు ఓర్పుగా చదివి అర్థం చేసుకుని తదుపరి యీ నాటకం చదవాలని నా అభిప్రాయం.

మూలమైన వాల్మీకమునకు దీనికీ కొన్ని మార్పులు ఉన్నాయి. సీత అగ్ని ప్రవేశం విషయం దీనియందు లేదు - దాని గురించి నేనూ ఒకప్పుడు వ్రాశాను. అది రాముని శీలానికి అఘాతం అనే నా ఉద్దేశం కూడా.

ఇక-యీ తెలుగు రచనలో ఛందః పద్ధతి వృత్తాలలో లోపించింది. పదాలలో యతి నియమం పాటించి కందపద్యాలతోసహా ప్రాస నియమం లేదు. ఈ పద్ధతి నాలాటి ఛాందసులకు నచ్చదు. వాటికి ఆ పక్షములో పేర్లుపెట్టడం ఎందుకూ? రామరావణ యుద్ధం వర్ణించలేదు.

భాష వ్యావహారికం—

ఏదో క్రొత్త పద్ధతి—

—శ్రీయామిజాల పద్మనాభస్వామి.

# శ్రీ కృష్ణభారతి

[వ్యాస, పోతనల భాగవత దశమ స్కందములు: ఒక తులనాత్మక పరిశీలన. రచయిత డా॥ ధూళిపాళ ప్రభాకర కృష్ణ మూర్తి. ప్రతులకు : శ్రీమతి టి. కృష్ణవేణి, కృష్ణునిపాలెం, వయా గోకవరం, తూ. గో. వెల : రు. 60/—]

ఈనాడు మన రాష్ట్రంలోనే గాక రాష్ట్రేతర విశ్వ విద్యాలయములందు తెనుగు సాహిత్య పరిశోధన బహు ముఖాలుగా విస్తరించుచున్నది. దీనికి ముఖ్య కారణము పరిశోధకుల (రీసర్చ్ స్కాలర్స్) సంఖ్య అధికం కావటం, వీరిలో కొందరు వినూత్న విషయ వ్యక్తీకరణకు మరికొందరు ప్రసిద్ధమైన పురాణ ప్రబంధాల లోని మార్మికతను వ్యక్తీకరిస్తున్నారు. ఇంకొందరు తెనుగును సంస్కృతము తదితర భాషా సాహిత్యాలతో తులనాత్మక అధ్యయన పరంగా పరిశోధన చేస్తున్నారు.

ఈ సిద్ధాంత వ్యాసం కేవలము "వ్యాస పోతనల భాగవత దశమ స్కంధములు. ఒక తులనాత్మక పరిశీలన" మాత్రమే.

శ్రీ మహాభాగవతమునందు విష్ణువు ఏకవింశత్యవతారములు వర్ణింపబడినను పూర్ణావతారముగా శ్రీకృష్ణ అవతార కథకే ప్రాముఖ్యము కలదు. 'కృష్ణమూల'మైన భాగవతం దశమస్కంథంలో కృష్ణ ప్రశస్తి పరాకాష్ఠ దశకు చేరినది. ఈ ప్రత్యేకతను పురస్కరించుకొని పరిశోధనకు ఈ భాగమును గ్రహించుట వీరి యుద్దేశ్యము. ఒక మహాగ్రంథమును గూర్చి సమగ్ర పరిశోధన చేయటం అసాధ్యం కాదు కాని పరిపూర్ణత సంక్షిప్తమవుతుంది.

శ్రీ ప్రభాకర కృష్ణమూర్తిగారు ఒక స్కంధాన్ని మాత్రమే గైకొని దాన్ని సంస్కృత భాగవతంతో తులనాత్మక అధ్యయనంచేసి రెండు గ్రంథాలలోని విషయాలను వాని బాగోగులను విస్తరించ డానికి మిక్కిలిగా పాటుపడిన విషయం దీనిద్వారా తెలుస్తున్నది. గ్రంథనామాన్ని కూడా 'శ్రీకృష్ణభారతి' అనుటలో భాగవత దశమ స్కంథంలోని శ్రీకృష్ణావతార ప్రత్యేకత వ్యక్తం చేయబడుతున్నది.

మొత్తం 384 పుటల (అభిప్రాయాలు మొ॥ పోగా) రచనను ఐదు అధ్యాయాలుగా విభక్తీకరించి విషయ వివేచన మొనర్చిన దీని యందు, ప్రథమాధ్యాయంలో పురాణ వాఙ్మయం, భాగవత ప్రాశస్త్యం కర్తృత్వ నిర్ణయం. భాగవత రచనా సందర్భం రాజకీయ పరిస్థితులు మొదలైనవి వివరించబడినవి. ద్వితీయాధ్యాయంలో పోతన అనువాద రీతులు, శ్రీధరీయ వ్యాఖ్యా నుసరణం, తృతీయంలో-యథా మూలం అనేవి, చతుర్థలో నవవిధ - ఏకాదశ భక్తులు వివరింపబడినవి. పంచమలో - తెనుగు భాగవతం (ముఖ్యంగా) వర్ణనలు - ఛందోలంకార వైచిత్రి తెల్పబడింది.

ఈ 'శ్రీకృష్ణభారతి' యందు అంతర్నిర్మాణ పద్ధతి అంతా తులనాత్మక పరిశీలనమే ముఖ్యంగా చేసికోబడింది. మూలగ్రంథం-దాని అనువాద పద్ధతి అనుశీలనం చేయబడినా-పోతన్నగారి రచననుగూర్చి ఇదమిత్థమైన నిర్ణయం అంటే ఇది అనువాదమా? లేక తెనుగున పునర్నిర్మాణమా అనేది తేల్చబడలేదు. ఎన్ని ఉదాహరణలిచ్చి ఎన్ని విశేషాల చెప్పడానికి యత్నించినా ఇది నడిచిన బాటలోని నడకగానే ఉన్నది కాని సమన్వయ ప్రతిపాదకం మాత్రం కొరవడింది.

విషయ వివేచనలో 'భాగవత కర్తృత్వ నిర్ణయము' మొదలైనవి (19-64 పుటలు) పూర్తిగా చర్విత చర్వణాలే. దీన్ని కొద్ది పుటల్లో సంక్షేపం చేసినా గ్రంథానికేమాత్రం కొదువ కలుగక పోయేది. ఆ విధంగానే 'భక్తి'ని గూర్చి చెప్పేటప్పుడు నవవిధ' ఏకాదశ భక్తి ప్రవచనం కూడా అధికమైంది. లోగా భాగవత విషయ రచనల్లో ఈ విషయం ప్రహతమైనదే! నవవిధ భక్తిలో పాదపూజనం (సేవనం) గూర్చి చెప్పేటప్పుడు విశిష్టాద్వైత పరంగా సమన్వయం చేసి ఆ సిద్ధాంతాల్లో పాదసేవగూర్చి ఎంత గొప్ప విషయం చెప్పబడిందో సంక్షిప్తంగానైనా చెప్పడం అవసరం. అసలు తెనుగు భాగవతం ద్వైతా ద్వైత విశిష్టాద్వైత సమన్వయం. దీనిలో పోతనగారు శ్రీకృష్ణ పరమాత్మ విషయంలో విశిష్టాద్వైతం వైపు బాగా మొగ్గు చూపినారు. దీన్ని గ్రహించి వివరించి - వ్యాసరచనతో పోల్చి చెపితే బాగుండేది.

ఒక్కొక్క సిద్ధాంత వ్యాస రచన ఒక్కొక్క రకంగా సాగుతుంది. దీనియందు ప్రభాకర కృష్ణమూర్తిగారి శ్రమ ప్రతివిషయం లోను కనిపిస్తుంది, వారికి ఉభయభాషలయందుగల పాండిత్యానికి నిదర్శనం ఈ పరిశోధన.

ఒక మహాగ్రంథంలో ఒక భాగాన్ని అందున భక్తిప్రధాన భాగాన్ని గ్రహించి అనేక రీతుల వింగడించటం - దాన్ని సమన్వయ పరచడం శ్రమైక సాధ్యం. ఈ విషయంలో ఉపరిశోధనకన్న పరిశోధనయే ముఖ్యం. ఈ పద్ధతిని ప్రభాకర కృష్ణమూర్తిగారు పాటించి 'పాఠకులకు' భాగవత పలరసా స్వాదన పదవి'ని మరియొక రీతిగా కల్పించినారు.

భారత భాగవత రామాయణములపై వచ్చిన వానికన్న రావలసిన పరిశోధనా విషయాలనేకం ఉన్నాయి. ఆ మార్గానికి రచన మార్గదర్శకంగా నిలుస్తుంది.

—శ్రీ రంగాచార్య





## "విజ్ఞాన విశేషాలు"

[రచన: జమ్మి కోనేటిరావు; పేజీలు : 64; వెల: రు.7-00; ప్రచురణ : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజ్ఞానభవన్, 4-1-435, బ్యాంకి స్ట్రీట్, హైదరాబాద్-500 001.]

నలభయి అంశాల గురించి స్వల్ప సమాచారం అందించే పుస్తకం ఇది. అంశాలు ఎక్కువభాగం ఖగోళ విజ్ఞానానికి పరిమితమై యున్నాయి. వార్తా ప్రాముఖ్యత గల మానవ కంప్యూటర్లు, ఆదిలాబాద్‌జిల్లాలో శిలాజపక్షి, గుండెలయకి జన్యుదయ వంటివి కూడా ఇందులో చోటుచేసుకున్నాయి అందుకే దీనికి విజ్ఞాన-విశేషాలు అని పేరు పెట్టడం జరిగిఉండవచ్చు.

పుస్తకం గెటప్, ముద్రణ బాగున్నాయి, ఏ ఆశయసాధన కోసం ఈ వ్యాసాలు రాసారో తెలియదుగాని సరదాగా చదువుకునేందుకు ఇందులో కొన్ని ఉపయోగపడవచ్చు. సైన్సు రచయితగా సుపరిచితులయిన కోనేటిరావుగారు రాసిన కొన్ని విషయాలలో స్పష్టత అచ్చుపొరపాట్లవల్ల లేకపోయిందో లేక మరి ఏ ఇతర కోణాల వల్ల కొరవడిందో మొత్తానికి అదొక లోటుగా కన్పించింది.

ఉదాహరణకు 17వ పేజీలో ఇలా ఉంది. 'ఇంకోలా చెప్పాలంటే విశ్వపరిణామ ఆరంభ విశేష ఘట్టాలు, కాలానికి, దూరానికి కమనీయమైన కలయిక ఉన్న సంబంధం కలిగిన చక్కని సమయం- దీని భావం ఏమిటో తెలియలేదు.

49వ పేజీలో బృహస్పతి గ్రహం గురించి ప్రస్తావిస్తూ 'ఇది గ్రహాలన్నిటిలోను పెద్దది. మొత్తం ఇతర గ్రహాలు, ఉప గ్రహాలు అన్నీ జోడించినా ఇదొక్కటే వాటన్నిటికన్నా పెద్దది అని రాశారు'. పాఠకులు దీనిని ఎలా అర్థంచేసుకుంటారో ?

60వ పేజీలో చంద్రయాత్ర గురించి రాస్తూ ప్రయాణానికి అయ్యే ఖర్చుల వివరాలకు ప్రాముఖ్యత యిచ్చి రాశారు. వీటికి సంబంధించిన శాస్త్రీయ సమాచారం ఇచ్చిఉంటే మరింత బాగుండేది.

**సి. వి. సర్వేశ్వరశర్మ**

లేఖ

## విమర్శ సరికాదు

డిసెంబర్ భారతి సంచికలో 'గ్రంథ విమర్శలు' శీర్షికన డా॥ మాదిరాజు రంగారావుగారు రచించిన రెండు కావ్యాలు 'కవిశ్రీ'గారిచే విమర్శకు గురైనాయి. ఆ విమర్శ సరైనది కాదనీ, కవిశ్రీగారు శ్రద్ధతో ఆ రెండు కావ్యాలను చదవలేదనీ చెప్పకో వీలున్నది. అందుకు కారణం కవిశ్రీగారు రంగారావుగారి కిర్మీరం జీవనబింబ కావ్యపు 'ఇంట్రొ'లోని

> 'ఇది కొన్ని ప్రతీకల సహాయంతో
> దృశ్య పరంపరలతో, సామాజిక స్థితుల
> యోజనతో, నిర్వహించే శిల్పమూ
> అవలంబింపబడింది'

అన్న వివరణను కూడా పట్టించుకోకుండా "ఆధునిక కవితా రీతుల్లో కూడా ప్రాచీన ప్రబంధాల పద్ధతిలాగే, కొన్ని రకాల వర్ణనలు, పడికట్టు రాళ్ళలాంటి భావాలు, ప్రయోగాలు ప్రస్ఫుటంగా చోటుచేసుకుంటున్నాయి. 'గతాను గతికం లోకం' అనుకోవలసి వస్తూంది" అని ఆరోపణ చేశారు.

కవిశ్రీగారు గమనించాల్సిందేమిటంటే మాదిరాజు రంగారావుగారు మానవీయ భావనలకు పీఠంవేసే ఆధునిక కవి. ప్రజాస్వామ్య సమసమాజం వారి ఆదర్శం. వారు 'విప్లవాత్మకంగా' చరిత్రలను చిత్రించరు. మనిషిలోని అజ్ఞానాన్ని తీవ్రంగా నిరసిస్తారు. శిల్పం విషయంలో వారు ప్రతీకలనూ పద చిత్రాలను ఎక్కువగా వాడుతారు. ప్రయోగాలకోసం ప్రయోజనాన్ని వదులుకోరు. వారి కావ్యాల్లో చంచలా లతికలు చాలా అరుదు. మానవీయ కాంతులే హెచ్చు. వారి 'మేల్కొన్న ఈ సమయం' కావ్యపు ముందు మాటే ఇందుకు ప్రబల సాక్ష్యం.

**శ్రీ పాతూరి రఘురామయ్య**

Printed & Published by S. Radhakrishna for Nageswara Rao Estates Ltd., at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna, Vijayawada. Phones : 75667 & 61247